ఆంధ్రదేశమంతటా ఆబాలగోపాలాన్ని

ఆనందపరుస్తోంది

మే 1 విడుదల!

ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్సు వారి

# ఇల్లరికం

నవయుగ రిలీజ్

దర్శకత్వం: టి. ప్రకాశరావు • నిర్మాత: ఎ. వి. సుబ్బారావు

*Chitralekha*

మే 14

విడుదల...

స్వస్తిశ్రీ వారి

# రేచుక్క పగటిచుక్క



డైరెక్షన్....కె.కామేశ్వరరావు,బి.ఎ. • కెమెరా..ఎం.ఎ.రెహమాన్

నిర్మాత.....నందమూరి త్రివిక్రమరావు .....




స్టూడియో.. విజయ వాహిని

అపారమైన శక్తియుత్సాహములే
మీ ప్రతిష్ఠను కాపాడగలవు

అమృత
మధురమైన పానీయము

వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాంటిది.




## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---


ముఖచిత్రం :

రేచుక్క పగటిచుక్కలో'

కుచలకుమారి



కీ॥ శే॥ డాక్టరు కే. యన్. కేసరిగారు

# గృహలక్ష్మి జయంతి దృశ్యములు








జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కె. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య



# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము



ఏప్రెలు నెల 26 వ తేదిన పూజ్యబాబు డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినం సందర్భమున గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము, కార్యాలయోద్యోగులకు, పరివారమునకు అన్న వస్త్రదానములు జరిగినవి.

ఈ ఏటి గృహలక్ష్మి కంకణ గృహీత సుప్రసిద్ధకవయిత్రి, పురాణేతిహాసవిజ్ఞానగని, ఆదర్శనీయమైన గృహిణియగు విజయవాడ వాస్తవ్యురాలు శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి. ఈమె బహుళగ్రంధకర్త్రి, చక్కని అనుభవపాండితీ గరిమలుగలవక్త. ఆమె గ్రంధములన్నియు భగవత్, పారమార్ధిక చింతలను ప్రోత్సహించునవియై లోకకళ్యాణమునకు తోడ్పడునట్టివి. ఉత్తమ ఆదర్శలక్ష్యాలతో రూపొందిన ఏ రచనలైనా, కవితయైనా కలకాలము వర్ధిల్లగలదు కాబట్టి శ్రీమతి ఇందుమతిదేవిగారి పరిశోధన, కృషిఫలితముగా రూపొందిన గ్రంధములు సుస్థిరములై భవిష్యత్తులో కవులకు, కవయిత్రులకు మార్గదర్శకములై, ఉపయుక్తములు కాగలవనుటలో సందేహము లేదు.

ఏటేటా పూజ్యబాబు జన్మదినము మాకొక పర్వదినము. గృహలక్ష్మి పత్రికను స్థాపించి, నిర్వహించడంతో పాటు ప్రేమ, ఆదరాలతో మా అభివృద్ధికి తోడ్పడిన ఆయనను స్మరించి భక్త్యంజలిఘటించుటకొక ప్రత్యేకావకాశము. ఆయన ఏటేటా గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానమునకని, కార్యాలయోద్యోగులకు, పరివారమునకు అన్నవస్త్రదానములకని ఏర్పరచిన నిధులు పూజ్యబాబు ఔదార్యమునకు, అభివృద్ధి అభ్యుదయాల పట్ల ఆసక్తికి నిదర్శనము.

గృహలక్ష్మి పత్రిక స్థాపనగాని, నిర్వహించుటగాని ఆయనకు మహిళాభ్యుదయముపట్లగల ఆసక్తిననుసరించినవే. గృహలక్ష్మి పత్రిక, యిప్పటివరకు బహూకరించబడిన 20 గృహలక్ష్మి స్వర్ణకంకణములు మహిళలకు విద్యావిజ్ఞానముల పట్ల కవిత్వము, చిత్రలేఖనము, సంగీతము, నృత్యములపట్ల ఆసక్తిని, సంఘసేవ, రాజకీయరంగములలో ప్రవేశించి సాహసోపేతముగా కృషిచేయుటను ప్రోత్సహించినవి. మహిళాభ్యుదయానికి గృహలక్ష్మి పత్రికద్వారాను, యితరత్రాను పూజ్యబాబు కేసరిగారు చేసిన సహాయము చిరస్మరణీయమేకాక అమూల్యమైనది.

ఇకముందు సయితం అభ్యుదయ రచనల ప్రోత్సహిస్తూ విజ్ఞాన వినోదాల వ్యాప్తికి గృహలక్ష్మి కృషిచేయగలదు. అందుకుగాను మీసహాయసహకారములు ఎప్పటియట్లు లభించగలవని ఆశిస్తున్నాము.

——(౦)——

# పంచవర్ష ప్రణాళికలు

మన పంచవర్ష ప్రణాళికలను గురించి, ప్లానులను గురించి, శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు మద్రాసులో విల్లివాకం ఆంధ్రసంఘ సమావేశంలో విమర్శిస్తూ స్వరాజ్యంవచ్చి 12 సంవత్సరాలయినా ప్రధానావసరాలయిన కూడుగుడ్డ కనుచూపుమేరలోకి రాలేదనియు, ఆహారధాన్యాలకు యింకా విదేశాల దయాదాక్షిణ్యాల మీదనే ఆధారపడవలసినదిగా నున్నదనియు, పెద్దపెద్దప్రాజక్టుల అంచనాలకు, పూర్తియయ్యేటప్పటికి అయ్యే ఖర్చులకు సంబంధముండుటలేదనియు, ప్లానుకు ప్రాతిపదికలయిన మనదేశంలోని ధనం, మనుష్యబలం, విదేశసహాయములలో విదేశసహాయం ఎప్పుడూ 100 కి 25 వంతులకంటె మించినచో ప్లానులు శక్తికిమించినవై ఫలితం అప్పులపాలు కావడం కాగలదు అన్నారు.

మన ప్రజల ప్రధానావసరాల తీర్చగల వ్యవస్థను రూపొందించగలవి శ్రీ విశ్వనాథంగారు చెప్పినట్లు భారీపరిశ్రమలుకావు. లఘుపరిశ్రమలు ప్రతియింటవెలసి ప్రజావసరాలను తీర్చకలుగాలి. వికేంద్రీకరణమూలంగానే అందరికి కూడు, గుడ్డ, నివాసవసతులు సమకూరుతవి. భారీపరిశ్రమలు ప్రోత్సహించడం పెట్టుబడిదారి విధానాన్ని ప్రోత్సహించడమే. భారీపరిశ్రమలు విదేశములతో వర్తకవ్యాపారములకనువైన ఉత్పత్తులకు, లఘు పరిశ్రమలు తీర్చలేని ప్రజావసరాల ఉత్పత్తులకు వినియోగపడాలి.

# సముద్రం పొంగింది

'శార్వాణి'

మబ్బుల్లోనుంచి జారిన వెన్నెలంతా ఇసుకమీద పాకిపోయింది. సముద్రంలోనుంచి ఉవ్వెత్తుగా లేస్తున్న తరంగాలు దరిని తాకి వెనక్కి ముడుచుకుపోతున్నాయి. మెత్తని మలయ పవనాలు చంపలను స్పృశించి జీవితలోతుల్లోని మధుర స్మృతులను వెతికి తీసుకువచ్చి మనస్సును పెన వేసుకుంటున్నాయి. ఒక చల్లని వెన్నెల రేఖ చాలు, తన హృదయంలోని భావనను తడపి మెరపు ముందు నిలబెట్టడానికి; ఒక సన్నని అలచాలు, తన ఆశలను గడిపి మనస్సును ముద్దచేయడానికి. ఒక చిన్న గాలి తెరచాలు_ఆలోచనలు మేల్కొల్పి, వంటినిండా చక్కిలిగింతలు పెట్టి పులకరింప చేయడానికి. ఎంతసేపు అలా కూర్చుంటే తను సాధించదలుచుకున్నది పొందగలుతుందా క్షణకాలం వెన్నెల కెరటం ... గాలి తెర యివన్ని తన ఆలోచనలచుట్టూ చేరి ఏదో మత్తత, మమత, ఎందుకు కల్గించాలి? ఒంటరిగా ఉంటే మాత్రం వర్షపుజల్లు పడకూడదని ఏక్కడ వుంది? వాన భయంకరమైన ఉరుములతో, మిరిమిట్లు గొలిపె మెరపులతో వస్తే భయంగానే ఉంటుంది. తుప్పరపడుతూంటే చినుకులు క్రిందపడి నడచి పోవాలనిపిస్తోంది. సముద్రతీరంలోకి వెళ్లిన తర్వాత కుచ్చిళ్లు పైకెగదోసి, పాదాలను లహరితో తడపాలనివుండదా!

"ఈనీటిలోని పాదాలు ఎలా మెరుస్తున్నాయో!" తనతడిసిన పాదాలవంక చూస్తూ సముద్రం వంక చూడకుండా నిలబడిన నారాయణ ఎందుకనాలి?

"వాటినితాకి కెరటాలు ఏమి ఆనందాన్ని అందుకొందామని?"

అతనికి తెలియకుండా అడగుతున్నాడసాకావాలని కొంతమంది కొన్నిసందేహాలు తెచ్చుకుంటారు. వాటికి సమాధానములు వాళ్లే వేసుకొని తృప్తిపడితే ఎంతో బావుంటుంది."

"సముద్రంలో ఉత్పన్నమవుతున్న అలలు ఎంత అదృష్టవంతులనుకున్నావు."

అతనెందుకు నిరాశ పడాలి! అప్పుడే తన ఆశలన్నీ నిరాశలయ్యేనా!

"నీవు మాత్రం అదృష్ట వంతుడవు _ ఎందుకు కాకూడదు" ఒక్క మాట చాలు - ఎగిరి రోదసీకుహరంలోని తారలను అందుకోడానికి.

అనలేదు

పాపం! ఆరోజు అతను ఎంతబాధపడ్డాడో! హృదయం వేదనతో కుంచుక పోయిందని తన కనికరంతో ఆవేదనకు సమయింప చేయమని తర్వాత కోరాడు.

కోపం వచ్చింది.

"మానవత్వంలో బలహీనతను ఎందుకంత వేగంగా బహిర్గతం చేయాలి!" ఇలా అడిగితే అతను మరీ యిదయిపోతాడు. ఈ ప్రశ్నకు సమాధానము మరొకప్పుడైనా అతని ద్వారా నేరావాలి; అంతవరకు విషయాల్ని విస్మరించలేను.

ఈ సారి నాపెదాలు చాలా అందంగా ఉన్నాయని వర్ణించాడు. రెండు మూడు పుస్తకాల్లో వర్ణలను సంకలనం చేసి, కంఠంస్తంచేసి, తప్పులేకుండా అప్పచెప్పాడు.

నవ్వొచ్చింది.

"నీకు తెలియని అందం నీదగ్గరవుంటే అట్లానే నవ్వుతావు. ఆ నవ్వులో ఎంతో అందం వుందన్న సంగతికూడా నీకు తెలియదు."

ఇటువంటి మాటలతో అతడు ఏడౌన్నత్యాన్ని పొందాలనుకుంటున్నాడో స్పష్టంగా తెలియచేయనివ్వడు.

తను వుంటున్న భవనం బ్రహ్మాండంగా వుందంటాడు.

ఆ భవనం ముందు ఎన్నో రకాల పువ్వుల మొక్కలున్నాయట.

"పారిజాతాలు బాగా విచ్చి పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. నీరాకకోసం వేయికళ్ళతో ఎదురు చూస్తున్నాయి" అసహజంగా మాటలు వల్లిస్తుంటాడు.

నా కీవర్ణనలంటే వొళ్లుమంట.

కారు మొన్ననే మార్చాడట. తనకు ప్రమోషను వచ్చిందట. తన అంతస్తు పెరిగిందట.

ఇవన్నీ ఎందుకు చెప్పుకోవడం! పరిస్థితులలో అతనికి జరుగుతున్న మార్పులు కన్పించకుండా వున్నాయనా!

క్రొత్తకారు కన్పిస్తుందిగా.

ఎందుకు చెప్పుకోవాలి.

అడిగితే మథన పడతాడు. ఆడకుండా వూరుకుంటే, చెప్పడం మానడు.

ఒక రోజున వర్షం బాగా కురుస్తే బయటకు వెళ్ళ బుద్ధివేయలేదు. పైన ముందుగదిలో తలుపులు తెరుచుకొని కూర్చున్నాను. పల్చబడుతున్న మేఘాలను చూస్తూ అర్థంలేని మనుష్యులను మరచిపోతున్నాను.

"రాధా"! మెట్ల మీదనుంచి శబ్దం. ఉలిక్కిపడ్డాను. గబుక్కున వెనక్కి తిరిగి చూస్తే విలువైన దుస్తులతో నారాయణ పైకివచ్చాడు. కుర్చీ చూపించాను. కూర్చున్నాడు.

"మీ ఏకాంతాన్ని చెదిపి, ఆలోచనలను కదిపినందుకు క్షమించమని కోరుతున్నాను."

ఇటువంటి క్షమాపణలు మామూలే! అంచేత ప్రత్యేకత ఏమి చూపించ నవసరములేదు.

"ఇందులోమీరు చేసినపెద్ద పొరపాటేమి కన్పించడంలేదు. ఎందుకు క్షమించమని కోరుతున్నారో నాకు బోధపడడంలేదు."

నవ్వుతూనే మెల్లగా అనాలనే అన్నాను. అతని దగ్గిరనుండి తిరిగి సమాధానమురాలేదు, రాదుకూడా.

"ప్రతి చిన్న విషయానికి క్షమించమని అడిగే వాళ్ళను చూస్తే, నాకు బలే అసహ్యం వేస్తుంది. నే నీ విధంగా అంటున్నానని మీకు కోపంరావచ్చును అయినా నేను క్షమించమని అడగను."

చిరాకుగా అనేసి మెదలకుండా కూర్చుండిపోయాను.

"మీరు కోపంగా ఉన్నా, చాలా అందంగా వుంటారు-ఎందుకంటారు?"

బలవంతంగా నవ్వును పెదాలమీదికి లాక్కొని అని ఉంటాడు.

"నేను జుట్టు గొరిగించుకొన్నా, కళ్ళుపీక్కొన్నా చేతులు విరగగొట్టుకున్నా అందగానే వుణ్నానంటారు. అవునా! మగవాళ్ళంతా యింతే!"

ఈసారి అతడు తెల్లబోయాడు. సమాధానం కోసం వెతుక్కుంటూన్నాడు.

"ఏదైనా మనం అనుకోటంలోవుంది. ఇష్టంగా ఉంటే అసహ్యంగావున్న గౌరవిస్తారు. కష్టంగా ఉంటే అందాన్నిగూడా అవతలకు నెట్టివేస్తారు."

నా మాటలు శ్రద్ధగా ఆలకిస్తూ కూర్చున్నాడు ఇహ చేసేదేమీ లేక.

"మీతో వాదించటం నాకు చేతగాదు, ఒకవేళ వాదించ దలుచుకుంటే నన్ను నేను గెలుపొందటంకంటే ఓడిపోవడమే శ్రేయస్కరం!" అతి కష్టం మీద పెదవులు కదిలించి అన్నాడు.

"ఎందుకంత పేలవంగా మాట్లాడుతారు. నిజాన్ని తెలుసుకోవడం కోసం మీరెందుకు ఓడి పోవాలి! ఎవరికోసం యింతపెద్ద చదువులు చదివేరు?"

"ఉద్యోగంకోసం, సంపాదనకోసం"

"అంతేనా! ఏ విషయంలోనైనా నన్ను మీరు గెలవడానికి ప్రయత్నం చేయడానికి చూడండి. కాని మాటలతో నన్ను జయించలేనని నీరసంగా మాత్రం మాట్లాడవద్దు."

బయట వర్షంవెలిసింది. లేచి నిలబడ్డాడు.?

"కాఫీ తీసుకోకుండా వెళ్తున్నారా?"

"త్రాగివచ్చాను" విసురుగా మెట్లుదిగి వెళ్లిపోయాడు. కారుకన్పించేవరకు చూచి కుర్చీలో కూలబడ్డాను. నన్ను తెగ పొగుడుతాడు. నా అందాన్ని వర్ణిస్తాడు. అసహ్యంగా కన్పించినసాదుకూడా పొగుడుతూనే ఉంటాడు. అతని వర్ణనల వెనుక

ఏదో స్వార్థం, అతని పొగడ్తల వెనుక ఏదో సంకుచితత్వం, ఎవరికీ తెలియదనుకుంటాడు.

నన్ను అభిలషించే మనుష్యులు కేవలం ఆతిథ్యాన్నే కోరుకుంటున్నారుగాని, గాంభీర్యాన్ని ఎందుకు వాంఛించరు? మానసిక తృప్తి పొందడం వాళ్ళకు చేతకాదా! స్త్రీ సాంగత్యాన్ని కోరుకోవడంలో ప్రాధాన్యత శారీరక సంతృప్తికోసమేనా? మానసిక విలువలు బోధపరచుకుంటే మగవాళ్ళంతా మానసిక వ్యభిచారం చేయరు. ఎంతకాలం మానవత్వానికి ఈ పతనం సాగేది?

భయమేసింది! నిలువెల్లనా వణికి పోయేను.

శ్రద్ధగా పరిశీలించి చూస్తే మానవుడు మృగం కంటే హీనంగా ఎందుకు ప్రవర్తిస్తున్నది, యిప్పుడు అవగతమవుతుంది. రెండు భిన్న లింగాలకు మధ్య తుచ్ఛమైన స్వభావాలు లేకపోతే చరిత్రకు హీనత వుండదు. మానవునికి పతనం వుండదు.

నారాయణకు ఇదంతా తెలియక ప్రవర్తిస్తున్నాడా? అతడు అన్నీ తెలిసే చేస్తున్నాడు. తెలిసి చేసున్న పాపాలకు, యిహంలోగాని, పరంలోగానీ విముక్తి వుండదు. పుణ్యంకోసమైన ఇంకోజన్మ ఎత్తలేదు.

బయటకు వెళ్ళడం ఎక్కువగా మానేశాను. ఇరువైనాలుగు గంటలు ఇంటిదగ్గర పడివుండటం విసుకుగానేవుంది? బొత్తిగా ప్రొద్దుపోవడంలేదు. పూను పోవడంకోసం చిన్న ఉద్యోగానికి దరకాస్తు పెట్టేను. వేళా విశేషం ఎటువంటిదోగాని వెంటనే ఉద్యోగం వచ్చింది. మళ్లా మగవాళ్ళ మధ్య మసలాలి. అడుగు తీసి అడుగువేసే స్త్రీజీవితం కత్తిమీద సాము చేసినట్టే వుంది. చుట్టూవున్న మనుష్యులు పదునైన కత్తులు కాదుగదా! చెప్పడానికి వీల్లేదు. ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చెప్పగలరు! అన్ని పుట్టలలోని పాములు కాటువేయడానికి ప్రయత్నించేవేగాని, పడగవిప్పి నాట్యం చేసేవిగావు.

మొట్టమొదటి రోజు జాయినింగ్ రిపోర్టు ఇచ్చి నాకు ప్రత్యేకంగా కేటాయించబడిన కుర్చీలోవచ్చి కూర్చున్నాను. టేబుల్ నిండా కాగితాలు, ఫైల్సు చిందరవందరగాపడివున్నాయి. ఒక్కసారి సెక్షనంతా కలయచూశాను. ఎవరి పనులలోవారు సమగ్రంగా నిమగ్నులైనారు.

"వీళ్ళంతా కలాలు బద్దలు కొట్టుకొని రెక్కలు ముక్కలయ్యేటట్లు ఎందుకు ఉద్యోగం చేస్తున్నట్లు?"

"బ్రతకడం కోసం!" ఇది నా ప్రశ్నకు జవాబు. అయితే నేను ఒప్పుకోను.

"నేను బ్రతకడంకోసం ఉద్యోగం చేయడంలేదు. కాలక్షేపణకోసం చేస్తున్నాను. అంటే వాళ్ళంతా నమ్ముతారా!"

"అంతా గుమాస్తాలు, చిన్న పెద్ద వారిగా వున్నారు. ఒక్కొక్కళ్లకి అరడజను పిల్లల చొప్పున వుండి వుంటారేమో?"

"పిల్లల్నికని వాళ్ళ పోషణకోసం ఆఫీసులలో అడ్డమైన చాకిరీ చేస్తున్నారు."

లోపల అనుకున్నందుకు ఎవరికీ బాధ వుండదు. ఒక్కొక్కరి మొహంలో జీవం కన్పించదు. వారు చేసే ప్రతిపని చాలా మాంత్రికంగా చేస్తున్నట్లు స్పష్టమవుతోంది.

కొన్ని రోజులుపోతే ...

కంపరమెత్తింది. ఒక్కరోజులోనే స్మశాన వైరాగ్యం. రాజీనామా ఇచ్చేస్తే యింటిదగ్గర వీలునామా పుచ్చుకోవచ్చును.

నా ఆలోచనలను చెల్లాచెదరుచేసి ఒక్క బక్కపాటి పొడుగుపాటి మనిషి నా టేబుల్ ముందు నిలబడ్డాడు. ఆ కళ్ళలోనికి చూశాను. కళ్లకు అద్దాలున్నాయి. ఆ కళ్ళవెనుక ఆశ, నిరాశ, విచారం, సంతోషం ఏమిద్యోతకమవుతున్నట్లు తోచదు.

ఫైల్సన్ని ఒకవైపుచేర్చి, కాగితాలన్ని కట్టగట్టి ఒక అరగంటసేపు నాకిచ్చిన వర్కు ఏ విధంగా చేయవలెనో వయనంగాచెప్పి, తన సీటులోనికి వెళ్ళిపోయాడు.

ఎందుకో అతనివంక చూడాలనిపించింది. అతనికి తెలియకుండా చూశాను. అతని టేబుల్ నిండా ఫైల్సే ఎత్తుగా పేర్చి ఉన్నాయి. దూరంనుంచి చూస్తే మనిషి కన్పించడు.

"అంత సన్నపాటిమనిషి యింతపని ఎట్లా చేయగలుగుతున్నాడో!" నాకున్నట్లుండి ఎక్కడలేని ఆశ్చర్యంవేసింది. అతనిలో ఏదో ప్రత్యేకత ఉన్నది. విచిత్రంగా కన్పిస్తాడు. ఎప్పుడూ బాధ పడుతున్నట్లు కన్పిస్తూవున్న, ఎప్పుడు నవ్వుతూనే ఉంటాడు. సెక్షన్లో అందర్నీ చిరాకుగా ఉన్నప్పు

డెల్లా చమత్కారంగా మాట్లాడి నవ్విస్తూంటాను. పనిలో నిమగ్నుడయ్యాడంటే ఒళ్ళు తెలియదు. చుట్టూవున్న మనుష్యుల్ని గుండ్రంగా తిరుగుతున్న పరిస్థితుల్ని అతన్ని పోషిస్తూ పెంచుతున్న ఆహారాన్ని, అతనికి వయస్సు నందిస్తున్న అహర్నిశాలను అన్నీ మరచిపోతాడు.

కాన్ సంక్షేపను ఎక్కువ.

ఆఫీసుపని రెండు మూడు రోజులు క్రొత్తగా వున్నా అలవాటుపడిన తరువాత ఏమంత కష్టంగా లేదు.

ఒకరోజు ఐదుగంటలయిన తరువాత, అతని టేబులువద్దకువచ్చి నిలుచున్నాను. అందరు వున్నారు. పాపమా మానవుడు అదిరిపడ్డాడు.

"ఏం కావాలండీ!" మెల్లగా నా ముఖం లోకి చూచి అన్నాడు.

"మీరు వ్రాసిన కథలన్నీ నాకు కావాలి! చదవాలనివుంది!"

"కథలు వ్రాస్తానని మీ కెలా తెలుసు!"

"ఊహించాను. మీకు తెలియదేమో నా ఊహ లన్నీ నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు నిజాలు అవుతుంటాయి!"

"ఈ ఊహమాత్రం నిజం కాదు."

"మీకు నిజాన్ని చెప్పినా తెలుసుకోవడం చేత కాదు. మీరు వ్రాసిన "మట్టి ఆలోచనలు"లో సరిగ్గా నా భావాలే వ్రాశారు."

మిగతా గుమాస్తాలు మా సంభాషణ శ్రద్ధగా వింటున్నారు.

"కథలన్నీ తప్పకుండా రేపు తీసికొనిరండి!" అంతకంటె ఎక్కువగా అతన్ని విసిగించదలుచుకో లేదు. తర్వాత ఇంటికి వెళ్ళిపోయాను.

ఆ మరునటిరోజు ఆఫీసుకు వచ్చిన వెంటనే అతని సీటువైపు చూశాను. ఖాళీగావుంది.

సెలవు చీటీతోపాటు తన కథలన్నీ పంపించాడు. క్యాజువల్లీవు రిజిస్టరులో సెలవువ్రాసి పంపించాను. ఆ పని నాది కాకపోయినా అలా చేయడంలో నా కెందుకో తృప్తి అనిపించింది.

స్వల్పకాలంలోనే మా గురించి వింతగా చెప్పుకోవడం విన్నాను. ఆఫీసునుంచి యింటికి వెళ్ళి పోతుంటే దారిలో నారాయణ ఎదురయ్యాడు.

"హల్లో! రాధా! చాలా మారిపోయావే! పూర్వంలాగా కన్పించడంలేదు." విషపు నవ్వు నవ్వి అన్నాడు.

"నేనేమీ మారలేదు. మీరు అనుకోవటంలో మారివుంటాను."

"మాటవరసకంటే మా కంపెనీలో మేనేజరు పోస్టు యిప్పించేవాడ్ని."

"థేంక్స్-మాటవరసకైనా మీరా మాత్రం అన్నందులకు మెనీ థేంక్స్."

"ఈ మధ్య మీ గురించి తమాషాగా చెప్పుకుంటూంటే విన్నాను నమ్మవచ్చునంటారా!"

-"నిజాన్ని మాత్రం నమ్మవద్దని అనడంలేదు."

అంతకంటే ఎక్కువగా మాట్లాడకుండా రిక్షా కట్టించుకొని వెళ్ళిపోయాను.

రాత్రి పక్క మీదకు వెళ్ళేముందు, కథలు తీసేను. అవన్నీ పూర్తిగా చదివేసరికి పన్నెండు దాటింది.

"అతనికి అతని కథలకు తేడాలేదు." సన్నగా నిట్టూర్చి కళ్ళు మూసేసరికి, ఎప్పుడు తెల్లవారి పోయిందో తెలియదు.

కాలకృత్యాలు ముగిసిన తర్వాత కాగితం కలం తీసుకున్నాను. ఇంతకుముందు నేనెవరికి ఉత్తరం వ్రాసి ఎరుగను.

రాజన్! నమస్సులు... మీ కథలన్నీ చదివాను. కథలో సంభవించిన ప్రతి సంఘటన మీ జీవితంలో అనుభూతిని గ్రహించ గల్గాను. మీలో ఇంత మహత్తర శక్తి దాగివుందన్న, ఆ ఔన్నత్యంతో బుద్ధి నిర్మలతతో నన్ను ఆకర్షింప చేయగలిగారని అనుకుంటూంటే నా మనస్సు లజ్జతో కుంచించుకు పోతోంది. ఒక్కసారి మా యింటికివచ్చి మా ఆతిధ్యాన్ని స్వీకరిస్తారని ఆశిస్తూ మీకోసం ఎదురు చూస్తూంటాను."

రాధా

ఆఫీసులో ఉన్నప్పుడు ఇవ్వలేదు. పోస్టులో పంపించాను. అతడు కవరు చించినప్పుడు నేను నా సీటులోనే కూర్చున్నాను. అతని చేతిలో ఆ వుత్తరం చాలాసేపు వుంటుందని, ఎన్నెన్నోసార్లు చదువు

కుంటాడని, ఎంతో ఆశ్చర్య పడతారని ఏమేమో అనుకున్నాను. ముఖ కవళికలను బట్టి ఆదేమి ద్యోతక మవుటలేదు. నారాయణ అయితే పట్టపగ్గాలు లేక పోను. ఎగిరి గంతేసేవాడు.

సాయంత్రం ఎప్పుడవుతుందా అని వేయి కళ్ళతో ఎదురుచూస్తూ కూర్చున్నాను. టంచన్‌గా ఐదు గంటలు కొట్టేసరికి లేచి నించున్నాను

"ఏమండీ! మీ ఇంటికి వస్తున్నాను." రాజన్ నుద్దేశించి అనేసరికి అతనేమి నిర్విణ్ణుడవ్వలేదు. మిగత గుమస్తాలకు అర్థంకాక తెల్లమొహాలు వేసుకొని, వాళ్లలో వాళ్ళు సతమత మవుతున్నారు.

అతని వెంబడి నడుస్తున్నాను.

రెండు అంతస్తుల్లో జనం చీమల్లా ప్రాకి మా వేపు విచిత్రంగా చూడడం మొదలుపెట్టారు.

"వాళ్ళట్లా కళ్ళప్పగించి చూస్తూంటే మీకేమైనా బాధగావుందా!" అతడేమంటాడో అని అడిగాను.

"నేనేమి తప్పుచేసేనని బాధపడాలి!" నాకు కావలసిన సమాధానమే వచ్చింది.

"స్త్రీ పురుషులకు ఒక్క శారీరక సంబంధమే గాని యింక ఎటువంటి సంబంధాలుండవా!"

"అల్ప సంస్కారులకు ఆత్మ ఔన్నత్యంలేని వాళ్ళకు ఒక్క శారీరక సంబంధంతప్ప యింకేమీ కన్పించదు. ఇటు చూడండీ మీతో ఇట్లా రెండు మూడు రోజులు తిరుగుతూంటే మన ఇద్దరిమధ్యనున్న సన్నిహితాన్ని చాలా అసహ్యంగా అర్థంచేసుకుంటారు."

"తప్పంతా ఎవరదంటారు."

"వాళ్ళకు మంచి దృష్టి లభించేవరకు, వాళ్ళ దృష్టికి యిమిడేటట్లు అనుగుణంగా ప్రవర్తించుకోవాలి. లేకపోతే మంచివాళ్ళుగూడా చెడ్డవాళ్ళగానే చూడబడతారు."

"మనలో కల్మషంలేనప్పుడు నటించటం దేనికని అడుగుతున్నాను."

"మనం అనుకున్న మాత్రంలో ప్రయోజనంలేదు. మన సమాజం నిజాలను తెలుసుకోడానికి ప్రయత్నం చేయదు."

"మీరు సమాజం అంటే భయపడతారన్నమాట"

"మన సమాజంచేసే పనులకు దేవుడే భయపడుతున్నాడు."

"అయితే మీ కథలన్నీ నిష్ప్రయోజనమే!"

"సమాజం బాగుపడుతుందనే ఉద్దేశంతో వ్రాయడం మొదలుపెట్టాను. అది బాగుపడేవరకు వ్రాస్తూనే వుంటాను."

"మీ సమాజం బాగుపడదు. బాగుపడటం నేర్చుకోదు."

అతడు ఇంట్లోకి తీసుకొని వెళ్ళాడు. బిస్కెట్లు, ఆపిల్ ముక్కలు, ద్రాక్షపళ్లు తీసుకొనివచ్చాడు.

"నా ఉత్తరం చూచుకొని ఏమనుకొన్నారు."

"మీ రనుకున్నది మాత్రం అనుకోలేదు."

"నేను అనుకున్నదికూడా మీకు తెలుసా!"

"దివ్యదృష్టికాదు, ఊహాగానం"

"మీరు కవులుగా, ఊహాగానం అవసరం."

"సరి, ఇంతకు నా గురించి మీ అభిప్రాయం."

"నాకెటువంటి అభిప్రాయం కల్గలేదు."

"కలిగే అవకాశంవుందా!"

"చెప్పలేను."

"మీతో ఇంత ధైర్యంగా వస్తున్నందుకు మీకు చాలా కోపంగా వుందనుకొంటాను."

"ఉంటే ఇలా చేసేవాడ్నే కాను."

"పోనీ నన్నే విధంగా అర్థంచేసుకొంటున్నారు."

"నన్ను నేను అర్థంచేసుకోడానికి ప్రయత్నించను. అటువంటప్పుడు ఇతరులను అర్థంచేసుకొని, నేను ఏమిచేసుకోవాలో అర్థంకాకుండావుంది."

"జీవితమంటే, మనుష్యులంటే ఎందుకంత అసహ్యం చూపుతారు."

"అవన్నీ నిర్లక్ష్యం కనుక."

"మీకు వివాహమయిందా."

"లేదు."

"లేకపోయినా పిల్లల తండ్రిలా కన్పిస్తారు."

"అవి, చల్లారిపోతున్నాయి, తీసుకోండి."

"పళ్లు చల్లారిపోతాయా? మీ హాస్యం యిక్కడకూడా వుంటుందన్నమాట."

ద్రాక్షపళ్లు తింటూ అతని ముఖంవంక పరీక్షగా చూశాను.

"చూడండీ మీ స్వల్పకాల పరిచయం, చాలా జీవితపు విలువల్ని నేర్పించింది. నిజమేనంటారా!"

"యదార్థమయితే అదృష్టవంతుణ్నే."

"మీ రింతకాలం వివాహంచేసుకోకుండా ఎందుకున్నారు. కట్నాలు సరిగా రావడంలేదా!"

"నా వివాహం గురించి మీ రెండుళ్లో చాలా శ్రద్ధ చూపుతున్నట్లున్నారు. మీ వివాహ మయిందా!"

"లేదు."

"నన్ను చేసుకోడానికి మీ కేమైనా అభ్యంత రమా!"

నా స్నేహపు తృళ్ళిపడి, సిగ్గుతో తలవంచేసు కున్నాను. అతడు ఎందుకు అంత ధైర్యంచేసి అన్నది, నాకు తెలియదనుకున్నాడు.

"నా కేమీ అభ్యంతరంలేదు."

"ఈ జన్మలో కాదు."

"అంటే ఈ జన్మలో మరొకరికోసం సర్వం త్యాగంచేశారనుకుంటాను. కౌసల్య మిమ్మల్ని మోసం చేసిందనుకుంటాను."

"నన్ను ఎవరు మోసంచేయలేదు. నా చేత నేను మోసంచేయబడ్డాను."

"కథలు వ్రాసేవాళ్ళంతా ఇట్లానే మాట్లాడు తారు. కథలో ఒక సందర్భంలో ఇహ లోకంలో గాని పరలోకంలో గాని, వాంఛనీయమైనది కౌసల్య తప్ప నా కింకెవరు లేదన్నారు. జ్ఞాపకంవుందా!"

"అవన్నీ ఇప్పుడు జ్ఞాపకం చేయకండీ! ఈ జీవి తాన్ని తవ్వినకొలది కన్నీరుతప్ప కనకం దొరకదు."

"ఆ కన్నీటిలో నేవుంది జ్ఞానోదయాన్ని కలించే సత్యం."

"చాలా ప్రొద్దుపోయింది."

"వెళ్లిపొమ్మని చెప్తున్నారా! మీ కంత కష్టంగావుంటే వెళ్తాలెండీ!"

"కౌసల్య అన్న మాటలు, మీ ప్రవర్తనచూస్తే మతికి వస్తున్నాయి. నావలన జరిగిన పరాజయాన్ని నా జీవితంలో, మరో వ్యక్తి ఈ జన్మలోనే తీర చిల్లి తనలో కౌసల్యకు బదులుగా అంతర్లీనం చేసు కుంటుంది."

"ఆ వ్యక్తి ఎవరు?"

"మీకు తెలియకనే అడుగుతున్నా?"

"చెబుతేనే నోటి ముత్యాలు రాలిపోవులెండి."

"రాధా!"

"అర్థంలేని అఘాతం వొద్దు."

నేను లేచి నిలబడ్డాను. పెరట్లోవున్న గులాబీ పువ్వును కోసి ఇచ్చారు.

"ఇవన్నీ ఎందుకు?"

"పట్టినే పెట్టుకుండలేక."

"వెనుక ఏదో కారణం వుంది."

"రాత్రంతా మీ మనస్సులో ఈ పూలు పలక రిస్తాయి."

"కలలో మీరు పలకరిస్తారు"

"అటువంటి గతికి నన్ను రానివ్వకండి."

"కలలో రాధ ప్రత్యక్షమైతే లేచి ఆరి పేస్తారా".

"అది ఏమంత అసాధ్యమైన పనికాదు."

"చాలా ప్రొద్దుపోయింది. అమ్మ ఇంటి దగ్గర కనిపెట్టుకొని వుంటుంది."

లేచి ప్రయాణ మయ్యాను. అతడేమి అడ్డు పెట్ట లేదు. మా ఇద్దరి మధ్య సన్నిహితం ప్రబలుతూ వస్తూంది. గిట్టనివాళ్లు మామీద చాలా దుష్ప్రచారం చేసి చాలా అసభ్యంగా ప్రవర్తించారు.

ఒకరోజు తీరుబడిగా కూర్చున్నాను. పేపరు పేజీలు త్రిప్పుతూ అకస్మాత్తుగా ఒకచోట ఆగి పోవలసి వచ్చింది.

నిన్న తెల్లవారు ఝామున రాజన్ కళేబరము మెరీనా బీచ్ ఒడ్డున దొరికిందని, పోలీసువారు దర్యాప్తు చేస్తున్నారని వుంది.

'రాజన్ ఎవ్వరు?' తృళ్ళిపడ్డాను. వళ్ళు తూలి పోయింది. మళ్ళా ఎప్పుడు తెప్పరిల్లేనో నాకే తెలియదు.

ఒక అరగంట ముందే ఆఫీసుకు వచ్చి కూర్చు న్నాను. వచ్చిన గుమస్తా నెల్లా అడిగాను.

"మొహం ఆనవాలు పట్టలేనంత ఇదిగా వుందని, మన రాజన్ కాదని" ఎవరికు తోచింది వాళ్లు చెప్పారు.

ఆ రోజు రాజన్ ఆఫీసులోకి రాకపోయేసరికి ఆఫీసువాళ్ళంతా హాస్పిటల్ చుట్టూ మూగాము. వివరాలు ఏమైనా తెలుస్తాయేమో అని.

ఎవరూ ఆనవాలు పట్టలేక పోయారు.

నేను శవాన్ని చూసే స్థితిలో లేను. "అతను మాత్రం మన ఆఫీసులో పనిచేసే రాజన్ మాత్రం కాదు" అని అందరి అభిప్రాయం.

"అయితే రాజన్ ఏమయ్యేడు!"

ఆఫీసు మానివేసి యింటికివచ్చి ఎన్నిరోజులు ఆలోచించినా సమాధానం రాలేదు.

—(o)—

# ఉష

**శ్రీమతి డి. వాణి**

ప్రకాశం !

నా ఒంట్లో యేమీ బాగులేదు. అర్థంలేని కక్షతో మిమ్మల్ని దూరంచేసుకొని యేకాకినైపోయాను. ఉషను చూడాలని చాల ఆత్రుతగా ఉంది. నేను మీకు చేసిన ద్రోహాన్ని మర్చిపోరూ! నన్ను చూడటానికి మీరిద్దరూ వస్తే నా యీ ఆఖరిక్షణాల్లో మనశ్శాంతి చేకూర్చిన వారవుతారు. ఎంతో ఆశతో వ్రాస్తూ మీరాకకోసం నిరీక్షిస్తున్నా - శ్రీరాం;

ఉత్తరం చదివిన ప్రకాశరావు క్రుంగిపోయాడు. తన నిరాదరణమూలంగా తిరిగి రాలేని దివ్యలోకాలకు వెళ్లిపోయింది ఉష! తనామెకు యెంత ద్రోహం చేశాడు! మామగారైన శ్రీరాం ముఖం యెట్లాచూడగలడు! ఉష యేదంటే తనేమని సమాధానం యివ్వగలడు? ప్రకాశరావు కళ్లలో నీళ్లు తిరిగాయి శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయాడు.

♦ ♦ ♦

అందమూ, తెలివితేటలూ, ఔదార్యమూ మూర్తీభవించిన ఉష యింజనీరు శ్రీరాం యేకైక పుత్రిక. చిన్నతనంలోనే తల్లి కరువైన ఉషను అల్లారుముద్దుగా పెంచాడు తండ్రి. ఉష కాలేజీలో బి. ఏ చదివేరోజుల్లో ప్రకాశరావుతో పరిచయమైంది. అతను స్కాలర్‌షిప్‌తో ఎమ్. ఏ. చదువుతున్నాడు. విద్యార్థులందరూ ఉషపరిచయంకోసం తహ తహలాడేవారు. కాని ఆమె ముభావంగా ఉండేది. ప్రకాశరావు తెలివితేటలూ అతనిలోని విజ్ఞానకాంక్ష ఆమెను చాల ఆకర్షించాయి. ఏకాకి, దరిద్రుడూ అయిన ప్రకాశరావుతో శ్రీమంతుల యింటిపిల్ల ఉష స్నేహం చేయడంచూచి చాల మంది అసూయపడ్డారు. కాని ఉషలక్ష్యపెట్టలేదు.

ఇద్దరూ తరచుగా లైబ్రరీలో కలిసేవారు. వారి సంభాషణలో యెన్నో విషయాలు దొర్లేవి. రెండు సంవత్సరాల్లో వారెంతో ఆత్మీయులైనారు. ఉష తన నిండు హృదయాన్ని ప్రకాశరావుకి అర్పించింది. ప్రకాశరావుకి ఉష అంటే ప్రేమ, గౌరవమూ ఉన్నాయి. ఒక్కొక్కసారి ఆమె తన భార్య అయితే తన జీవితం ధన్యమౌతుందనుకునేవాడు. కాని వెంటనేయెదురుగా తనదారిద్ర్యం, ఒంటరితనమూ వికటాట్టహాసం చేస్తూ తాండవించేవి. తన వాంఛను అణగద్రొక్క ప్రయత్నించేవాడు.

పరీక్షలు పూర్తయాయి. పార్కుకి వెళ్తున్న ఉషను ప్రకాశరావు కన్పించాడు.

'నేను రేపు మద్రాసు వెళ్లామనుకుంటున్నాను ఉషా!' అన్నాడు ఇద్దరూ నడుస్తూ వచ్చి గార్డెన్‌లో కూర్చున్నారు.

'అంత తొందరగా వెళ్లిపోతున్నావేం?' ఉష కంఠంలో బాధధ్వనిలచింది.

'నాకిక్కడ యెవరున్నారని ఉండను ఉషా! అసలు యెక్కడా నా కెవరూ లేరు. అక్కడ ఉద్యోగాలకు యింకా బాగా అవకాశాలుంటాయని ఆశగా ఉంది', ప్రకాశరావు కంఠంలో తొణికిసలాడిన దైన్యం ఉషను కదల్చివేసింది. కొంతసేపు యిద్దరూ మౌనంగా ఉండిపోయారు.

'ఉషా!' ప్రకాశరావు పిలుపువిని ఆమెతలెత్తి చూచింది. ఆమె కళ్లు ప్రేమ ఆత్మీయలతో మెరుస్తున్నాయి. ఆమె కళ్లలోని భావాల్ని చదవగల్గిన ప్రకాశరావు హృదయం ఉరకలువేసింది.

'నీవే నా సర్వస్వం ఉషా! నా జీవిత భాగస్వామినివైతే నేను ధన్యుణ్ణి. కాని ...! కాని మన అంతస్థులు వేరు. కలలోకూడ నేను నీ సాంగత్యాన్ని ఊహించడానికి అర్హుణ్ణి కాదు. లోకం, నేను నీ డబ్బు, అందంచూచి స్నేహంచేశానని భ్రమపడుతూంది. కాని నేను ఆశించేది నీ ఆత్మీయతే నని నీ వెనా గ్రహిస్తావనుకుంటున్నాను ఉషా! మనం మళ్లా కలుసుకుంటామో లేదో! ఈ అభాగ్యుడిని మాత్రంమర్చిపోకు!' ప్రకాశరావు వెళ్లడానికి నాలుగడుగులు వేశాడు. ప్రకాశరావు అభిప్రాయం గ్రహించిన ఉష ముగ్ధయిపోయింది.

'నేను అదృష్టవంతురాల్ని ప్రకాశం!' ఆమె ఎఱ్ఱని పెదవులమీద చిరునవ్వు మెరిసింది. తడబడే అడుగులతో వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినవైపే చూస్తూ ఉండిపోయాడు, ప్రకాశరావు.

♦ ♦ ♦

పోర్టికోలో కారెక్కుతున్న ఉషను శ్రీరాం పిలిచాడు.

'ఇంకో గంటలో నిన్ను చూడటానికి ప్రొఫెసరు మూర్తివస్తున్నారు. ఇప్పుడే ఫోన్ కాల్ వచ్చింది. ఎక్కడికీ వెళ్లకు ఉషా!' వాత్సల్యంతో ఉషతల నిమిరాడు. ఆమెకు తలపై పిడుగుపడినట్లయింది. మౌనంగా తనగదిలోకి వెళ్లిపోయింది.

మూర్తిరావడం, ఉషను చూచి వెళ్లడం జరిగాయి. మూర్తిని సాగనంపి లోపలికివచ్చిన శ్రీరాం వెక్కి వెక్కి యేడుస్తూన్న ఉషనుచూచి తెల్లబోయాడు.

'ఎందుకు యేడుస్తున్నావు ఉషా?' ఆప్యాయంగా ప్రశ్నించాడు.

'నాన్నా!' ఆశనిండిన కళ్ళతో తండ్రివైపు చూచింది.

'ఏమిటమ్మా నాతో చెప్పు'!' అన్నాడు.

'నేను ప్రకాశరావుని పెళ్లి చేసుకోవాలని నిశ్చయించేసుకున్నాను నాన్నా!' అని చెప్పింది. అంతలోనే శ్రీరాం ఉగ్రుడైనాడు.

'కూటికిగతిలేని బికారిని చేసుకుందామనుకుంటున్నావా? మనపరువుకి, హోదాకి భంగం కలుగుతుందన్న జ్ఞానంలేదూ?' తీవ్రంగా ప్రశ్నించాడు.

'ప్రకాశరావు గౌరవమూ, ప్రేమైకహృదయమూ కలిగిన వ్యక్తి, అతన్ని చేసుకున్నంతమాత్రాన పరువుకేనాడూ భంగం కలుగదు. ఇక పోతే హోదాకి, వివాహానికి సంబంధమేలేదు; ప్రశాంతంగా అన్నది.

'నీవతన్నే చేసుకుంటే ఆస్తిలో చిల్లిగవ్వ నీకు దక్కదు. నీకూ, నాకు యే విధమైన సంబంధమూ ఉండదు. ఏకాకిని, దరిద్రుడిని నా అల్లుడని చెప్పకోలేను,'' విసురుగా అన్నాడు.

'ప్రకాశరావు కంటె నాకు డబ్బుయెక్కువ కాదు. తన స్వయం కృషితో తప్పకుండా మంచి పదవిలోకి వచ్చి నా సుఖం చూస్తాడు. నిష్కల్మషంగా ప్రేమించే హృదయంకంటె ఆడంబరాలు, హోదా ముఖ్యమని భ్రమింపజేసే ధనిక వాతావరణం యెన్నిటికీ ఉన్నతమైనదికాదు;' ఉష అన్నది.

'నీనిశ్చయిం మార్చుకోవన్నమాట!' శ్రీరాం గద్దించాడు.

'సమయానుకూలంగా ఉద్దేశాలు మార్చుకోవడం నా మతంకాదు!' అన్నది ఉష.

శ్రీరాం మౌనంగా కోపంగా వెళ్లిపోయాడు.

♦ ♦ ♦

శుభముహూర్తంలో ఉషా ప్రకాశరావుల వివాహం చాల సామాన్యంగా జరిగిపోయింది, ఎంతో వైభవంగా జరుగుతుందని ఊహించినవారంతా నివ్వెఱపోయారు. ఉషతమకు దక్కలేదనే అసూయతో కొందరు విద్యార్థులు ఆమెకు తగినశాస్తి అయిందని సంతోషించారు. శ్రీరాం కోపంగా, మౌనంగా ప్రవర్తించాడు.

తండ్రి ఆదరణ కరువైన ఉష ఆ యింట్లో ఉండలేకపోయింది. సంతోషమూ, బాధానిండిద హృదయంతో భర్త వెంట మద్రాసు వెళ్లిపోయింది.

♦ ♦ ♦

ప్రకాసరావు ఎమ్. ఏ. ఉష బి. ఏ ఫస్టుక్లాసులో ప్యాసయారు. ఆనాటి నించి అతను దరఖాస్తుపెట్టని ఉద్యోగంలేదు. కాని యెక్కడాలభ్యంకాలేదు. ఉష దగ్గిరున్న డబ్బుచాల భాగం అయిపోయింది. ఆమెను చూసి ప్రకాశరావు జాలిపడేవాడు.

'సిరిసంపదలతో తులతూగవలసినదానివి ఉషా! ఈ దరిద్రుడితో అష్టకష్టాలూ అనుభవిస్తున్నావు?' అనేవాడు.

'మీరలా అంటే సహించలేను. ప్రేమైకహృదయంకంటె క్షణికమైనడబ్బెప్పుడూ ముఖ్యంకాదు' ఉష విశాలనేత్రాలు ప్రేమతో మెరుస్తూంటే ప్రకాశరావు కళ్లు చెమర్చేవి.

ఉషకూడ, ఉద్యోగ ప్రయత్నం చేయసాగింది. కొద్దిరోజులకే ఆమెకు, స్త్రీలకు ప్రాముఖ్యతఉండే ఒక బిజినెస్ ఫర్ములో ఉద్యోగం దొరికింది.

'ఇక నీ సంపాదన తినికూర్చోమన్నావా ఉషా?'

అన్నాడు. అతనికి ఉష ఉద్యోగం చేయడంమెంత మాత్రం యిష్టంలేదు.

'నేను కొన్నాళ్లు చేస్తాను. మీరు ఐ. ఏ. యస్‌కి కట్టండి. నేను చేస్తున్నానని అనవసరంగా బాధ పడకండి', అన్నది ఉత్సాహంగా. ప్రకాశరావుకి యిష్టంలేకపోయినా పరిస్థితుల ప్రాబల్యంవలన ఒప్పుకోక తప్పలేదు.

♦ ♦ ♦

'ఉష ఉద్యోగం చేస్తోందికదూ! ఎలాగైనా స్త్రీ సంపాద తింటూ యెలా కూర్చున్నావో?' వికటంగా నవ్వుతూ ఒక స్నేహితుడు ప్రకాశరావు హృదయంలో అగ్నిరగిల్చాడు. అతను ఉషచేత తిరస్కరింపబడ్డాడు. ప్రకాశరావు చిన్నబోయి మౌనంగా వెళ్లిపోయాడు.

ఉషా ప్రకాశరావుల అన్యోన్యతచూచి ఓర్వలేనివారు, ఉష తమకు భార్యకాలేదనే అక్కసు గలవారూ ప్రకాశరావు తారసపడగానే ఉష ఉద్యోగం ప్రశక్తితెచ్చి అతన్ని చిన్నబుచ్చి హేళనగా మాట్లాడసాగారు. క్రమంగా ప్రకాశరావు విసుగెత్తిపోయాడు. ఆ మాటల ప్రభావంవలన అతనికి ఉషపై మూర్ఖకోపం వచ్చింది. ఆమె తనను అవమానించడానికి చేస్తోందని, తన లక్ష్యం లేకపోవడంవలననే తనువద్దన్నా ఉద్యోగంలో చేరిందని భావించసాగాడు. ఉషతో ముభావంగా ఉండటం ప్రారంభించాడు.

'నాతో సరిగ్గా మాట్లాడటంలేదేం?' అని అడిగింది ఒక రోజున.

'నన్ను నలుగురిలో తలెత్తుకొని తిరగనీయదల్చుకోలేదా ఉషా?' సంబంధంలేని యెదురు ప్రశ్నలేశాడు. అతని కంఠంలోని తీవ్రత ఉషను కలవరపరిచింది. విషయం సులువుగా అర్థం చేసుకుంది.

'మనమంటే కిట్టని మూర్ఖులమాటలు విని బాధపడకండి. నా మనస్సులో అటువంటి ఉద్దేశంలేదు, సంసారంలో యిద్దరికీ సమానబాధ్యతలున్నాయి;' ఉష ప్రకాశరావుని అనునయించింది. ఆమె మాటలు అతనిలో యేమార్పు తేలేకపోయాయి.

♦ ♦ ♦

ప్రకాశరావు ఐ. ఏ. యస్ పరీక్షలో ఇంటర్వ్యూలో విజయం పొందడం వెంటనే ఉద్యోగంలో చేరడంజరిగిపోయింది. ఆర్డర్సువచ్చిన రోజున ఉష పొందిన ఆనందానికి మేరలేదు. తమ కష్టాలుతీరిపోయాయని, 'ఇక నీవు ఆఫీసరు భార్యవే ఉషా!' అని ప్రకాశరావు చిలిపిగా తనకళ్లలోకి చూస్తాడని, యిన్నాళ్ళూ అనుభవించిన ఆవేదన అంతమై పోతుందని మురిసిపోయింది. స్వీట్సు చేసి భర్తరాకకోసం ఆత్రుతగా యెదురు చూడసాగింది.

ప్రకాశరావు యెదురుగానిల్చున్న ఉషను గమనించనట్లుగా లోపలికి వెళ్ళిపోయాడు. ఉష ఉత్సాహం అణగారిపోయింది.

'ఉద్యోగం వచ్చినంత మాత్రాన యివన్నీ యెందుకు?' స్వీటుని విసురుగా ప్రక్కకి నెట్టివేశాడు. ఉషకు దుఃఖం పొంగుకొచ్చింది. తన జీవితంలో ఆశించిన మధురక్షణాలు యెండమావులవుతున్నాయా? ప్రకాశరావులో యెందుకీ కాఠిన్యం? తనపై అందరికీ యెందుకీపగ? బాధతో కూర్చుండిపోయింది.

♦ ♦ ♦

ప్రకాశరావు ఆఫీసరు. చక్కటి చిన్నబంగళా, కారు ఉన్నాయి. ధనవంతులైన స్నేహితులకు కొదవలేదు. పూర్వపుమంచితనం పోయింది. అహంభావం, నిర్లక్ష్యంపాతుకున్నాయి. ఎప్పుడూ స్నేహితులతో సినిమాలకు, క్లబ్బులకూ తిరుగుతూ ఉండేవాడు. ఉషతో మాట్లాడటమే కరువైపోయింది. ఉష తన్నవమానించడానికే ఉద్యోగం చేసిందని, తనంటే లక్ష్యంలేదని అతనికొక మూఢవిశ్వాసం.

ప్రకాశరావు తనతో మాట్లాడతాడేమోనని ఉష ఆశతో యెదురుచూచేది. కల్పించుకొని మాట్లాడ ప్రయత్నించేది. ఒక్కొక్కసారి సమాధానమే చెప్పేవాడుకాదు. ఆరోజు ఉష కాఫీ కప్పుతెచ్చి టేబిలు మీదపెట్టింది. చూడనట్లుగా పేపరుచదువుకోసాగాడు.

'నేనంటే యెందుకీ కోపం? నేనేం తప్పు చేశాను' అని అడిగింది రుద్ధకంఠంతో

'ఇష్టం లేనిపని చేసి విసిగించడమే కాక యింకా బాధ పెట్టడానికి ప్రయత్నించకు ఉషా!' చటుక్కున వెళ్ళిపోయాడు. ఉష కన్నీళ్లతో నిల్చుండిపోయింది.

ఒకసారి ఉషకు జ్వరం వచ్చింది. ప్రకాశరావు

లక్ష్య పెట్టకుండా తన కార్యక్రమాల్లో మునిగి పోయాడు.

'నా దగ్గర కొంచెం సేపు కూర్చోరూ?' హీన స్వరంతో భర్తను పిలిచింది.

'నాకు టెన్నిసుకి టైమవుతూంది,' విసుక్కుని వెళ్ళిపోయాడు. ఉష క్రుంగిపోయింది. ప్రకాశ రావెంత మారిపోయాడు! తనంటే ఎంతటి ప్రేమానురాగాలు ఉండేవి! ఉద్యోగం చేసినంత మాత్రాన తనకు అతనంటే లక్ష్యం లేనట్లేనా? తనవతడు అర్థం చేసుకోలేడా? ఈ సిరి సంపదలు యిద్దరి మధ్య అగాధం కల్పించడానికే కారణమైనాయి! తన జీవితం యెంతటి దుర్భరమైపోయింది. ఉష బాధతో యేడుస్తూ కూర్చుండి పోయింది.

ఉష చాల దుర్బలురాలైంది. ఆమెకు మనస్సిచ్చి మాట్లాడేవారే కరువైపోయారు. సౌందర్యంతో మెరుగులీనే ఆమె ముఖం నిరంతరాశేదనతో కళా విహీనమైపోయింది. ప్రకాశరావుకి ఉష అంటే నిర్లక్ష్యం, ద్వేషం యెక్కువైనాయి.

ఒకనాడు ఉష కారుమీద మార్కెట్ వెళ్ళింది. ఈ లోపున ప్రకాశరావు వచ్చి కారు లేనందుకు మండి పడ్డాడు. కాఫీ త్రాగుతూంటే ఉష వచ్చింది.

'ఇష్టం వచ్చినప్పుడల్లా షికార్లకు వెళ్లుతున్నావన్నమాట? నేనంటే లక్ష్యం ఉందీ? శ్రీమంతురాలివి కదూ!' హేళనగా, కోపంగా అన్నాడు. ఉషకా మాటలు ములుకుల్లా గ్రుచ్చుకున్నాయి.

'ధనరాసులే కావలసి వుంటే మిమ్మల్నే చేసుకునే ఉండను,' బాధగా అన్నది.

'గొప్ప త్యాగం చేస్తున్నట్లు నటించి నన్ను అవమానం చేయడానికేకదూ చేసుకున్నావు!' తీవ్రంగా అన్నాడు.

"స్త్రీ యెన్నడూ భర్తను అవమాన పరచాలని అనుకోదు. కష్ట సుఖాలు సమానంగా పంచుకొని సంసారంకోసం అవకాశాల్నిబట్టి యెవరు పాటుపడినా ఒకటికాదా? మనని చూచి అసూయపడే మూర్ఖుల మాటలువిని అనవసరంగా బాధపడి బాధ పెట్టడం భావ్యమా?' గద్గద స్వరంతో అడిగింది.

'మాటలతో మభ్యపెట్ట ప్రయత్నించకు ఉషా! ఇంకా ఆత్మ గౌరవాన్ని చంపుకుంటూ నీ మాట ప్రకారం నడవలేను. నేను నిన్ను బాధ పెడుతున్నానని నీ అభిప్రాయమైతే యీనాడే నీవు వెళ్లిపోవచ్చును. నాకు శాంతిగా ఉంటుంది', ప్రకాశరావు ఆడిన ప్రతిమాటలో కాఠిన్యం, అహం తొణికిసలాడాయి.

ఈ మాటలు వింటూన్న ఉష కళ్ళముందు గత జీవితం మెరిసింది. ఆనాడు తన ప్రకాశం యేమన్నాడు!

'లోకం నీడబ్బు, అందంచూచి నీతో స్నేహం చేశానని భ్రమ పడుతూంది ఉషా! నీ ఆత్మీయత నా ఒంటరితనాన్ని మరుగు పర్చింది. నా సర్వస్వం నీవే. నీవు నా జీవిత భాగస్వామినివైతే ధన్యుణ్ణి!' ఆ మాటలంటున్న అతని కళ్లలో ప్రేమా మంచితనం తొణికిసలాడేవి.

కాని—! యీనాడేమైంది? డబ్బే ముఖ్యంగా పరిగణించి, మూర్ఖాభిప్రాయాలతో చెప్పుడు మాటలు విని తనను బాధ పెడుతున్నాడు! తనను చేసుకోవడం వలన మనశ్శాంతి కోల్పోయానని నిందవేస్తున్నాడు! ఎంత కఠినుడైపోయాడు! కాదు! ప్రకాశరావు! తన భర్త! తన జీవిత సర్వస్వం! అతను దూరం కాకూడదు! ఉష మనస్సులో వివిధ భావాలు చెలరేగాయి.

'ప్రకాశం! నీ ఉషనే ప్రకాశం! నేనంటే ప్రేమ లేదూ?' పిచ్చి ఆవేశంతో అతనివైపు పరుగెత్తింది. కాని విదిలించుకొని వెళ్లిపోయాడు.

ఉష భర్త వెళ్లిన వైపే చూస్తూ ఉండిపోయింది. తన జీవితం యెంత హీనమై పోయింది! తను చదువుకునే రోజులెంత హాయిగా వుండేవి! ఆనాటి తన ప్రకాశం యెంత మంచివాడు! ఆమెకు తండ్రి జ్ఞాపకం వచ్చాడు. తననెంత ప్రేమగా చూచేవాడు తల్లిలేని లోటు యేనాడూ కన్పించలేదు! అంత ప్రేమగాచూచే తండ్రిని కాదనివచ్చినందుకు తనకిదేనా సుఖం! ఇటువంటి నిరాదరణ కోసమే నా ప్రకాశరావుని వివాహం చేసుకున్నది! టేబిలు మీదున్న భర్త ఫోటో వైపు చూస్తూ ఆలోచనల్లో పడిపోయింది ఉష

♦ ♦ ♦

కారు హైరోడ్ మీదుగా వెళ్లిపోతూంది. ప్రకాశరావు కళ్ళ యెదుట ఉష విగ్రహమే కనబడసాగింది. అందమూ, తేపీ, ఉత్సాహమూ మూర్తీభవించిన ఉష! మరుక్షణం పాలిపోయి నీరసంగా బాధ నిండిన కళ్లతో ఉన్న ఉష అతని మనోనేత్రంముందు మెరిసింది. ఆమె పతనానికి కారణం యెవరు? తను

కాదూ? ఈనాటి తన ఔన్నత్యానికి కారకు లెవరు? తను ఆఫీసరయి సుఖించడానికి పాటుబడి ప్రోత్సహించిన దెవరు? ఉష దిక్కులేని తనను ప్రేమించి తనకోసం అన్ని సౌఖ్యాలూ వదలుకొన్న ఉష దేవత కాదూ! శ్రీమంతుడైన తండ్రినీ, గొప్ప యింటి యువకుల్నీ తిరస్కరించి తనను వివాహ మాడిన ఉషను హృదయంలో దాచుకొని ప్రేమించ వలసిన బాధ్యత తనదికాదూ! మూర్ఖుల మాటలు విని మానవత్వం చంపుకొని తను ఉష కెంత బాధ పెడుతున్నాడు! 'స్త్రీ భర్త నవమాన పరచాలని యెన్నడూ ప్రయత్నించదు ప్రకాశం! ఇటు చూడు! నేనే-నీ ఉషని! నేనంటే ప్రేమలేదూ!' ఉష దీన వాక్కులు చెవుల్లో మారుమ్రోగాయి. మొదటి సారిగా ప్రకాశరావుకి పశ్చాత్తాపంతో దుఃఖం వచ్చింది. ఉష నిక యే మాత్రం బాధ పెట్టకూడదని సంసారంలో కరువైపోయిన ఆనందాన్ని నెలకొల్పాలని అనుకుంటూ కారును వడిగా యింటివైపు పోనిచ్చాడు.

◆ ◆ ◆

'ప్రకాశరావుకి మనశ్శాంతి తనవలని లేనప్పుడు తానెందుకీ ప్రపంచంలో? తనెవరికీ అక్కర్లేదు! ఉష ఆఖరి ఆలోచనతో శాశ్వతంగా ప్రపంచానికి దూరమైపోవాలనే నిశ్చయానికి వచ్చింది. గదిలోకి వెళ్ళి తల్లి ఫోటోకి నమస్కరించింది. గ్లాసులోని ద్రవం త్రాగింది. మృత్యుదేవత ప్రేమతో ఉషను తన ఒడిలోనికి తీసుకుంది.

'ఉషా!' అని పిలుస్తూ ప్రకాశరావు గదిలో అడుగు పెట్టాడు. నిర్జీవంగా పడివున్న ఉషను చూచి నిర్ఘాంత పోయాడు. 'ఉషా! నన్ను మన్నించవూ!' అంటూ ఆమె చేతులు తన చేతుల్లోకి తీసుకొని అంతులేని ఆవేదనతో దుఃఖించాడు.

ఉష మరణంతో తిరిగి ప్రకాశరావు ఒంటరివాడై పోయాడు. స్నేహితులు దూరమైనారు. విలాసాలన్నీ వదులుకొని నిరాడంబరమైన జీవితాన్ని గడప సాగాడు. ఉష ఫోటో చూచినప్పుడు అంతులేని ఆవేదనతో క్రుంగి పోయేవాడు.

◆ ◆ ◆

ప్రకాశరావు వెంటనే బయల్దేరి శ్రీరాం వద్దకు వెళ్ళాడు

◆ ◆ ◆

'ఉష యేదీ ప్రకాశం! నా చిట్టి తల్లి ఉష యేదీ?' గుమ్మంలో అపరాధివలె తలవంచుకొని నించున్న ప్రకాశరావును శ్రీరాం రుద్ధ కంఠంతో ప్రశ్నించాడు. అతని కళ్లు ఆత్రుతతో ఉషకోసం వెదుకుతున్నాయి. ముఖంలో జీవకళ తగ్గిపోతూంది.

'ఉష లేదు! నేను ఆమెను నిరాదరణ చేసిన ఫలితంగా ఆమె శాశ్వతంగా వెళ్ళిపోయింది. అధికార మదంతో మూర్ఖంగా ఉషను బాధ పెట్టాను. నేను ద్రోహిని!' గద్గద స్వరంతో అన్నాడు ప్రకాశరావు.

'ఏమిటీ? ఉషలేదూ? నా చిట్టితల్లి ఇక కన్పించదూ? అయ్యో! ఉషా! కన్నతండ్రినైకూడ మూర్ఖంతో నిన్ను దూరంచేసుకొని యెంత ద్రోహం చేశాను! ఇక నేను నిన్ను విడిచి వుండలేను నీదగ్గరకే వచ్చేస్తున్నా ఉషా!' శ్రీరాం ఆవేదన అణగారిపోయింది, ఉషకోసం వెదికే అతని కళ్లు శాశ్వతంగా మూసుకుపోయాయి.

కన్నీళ్ళతో బరువుగా అడుగులు వేసుకుంటూ బైటికి వెళ్ళిపోయాడు ప్రకాశరావు.

డాక్టరు కే. యన్. కేసరిగారి

నా చిన్ననాటి ముచ్చట్లు

వెల రు. 2.00 లే — పోస్టేజి ఉచితం

హిగిన్ బాదమ్స్ స్టాల్సులో దొరుకుతుంది

# హితరత్నములు

శ్రీ పోలాకి శ్రీనివాసరావు



(గతసంచిక తరువాయి)

ఆడంబర మును గాంచిన
పాడుం బడకున్న యట్టి । బ్రతుకైనను, వే
గీడున్ గూడును, పరపతి
వీడున్ సంఘంబులోన । విధిగా, హితుడా

చేయంగల కార్యమ్ముల
సూయమ్ముగ దలచి ధనము జాల బలుపగా
శ్రేయంబ? చేత సంచులు
న్యాయంబని ఘనులు బట్టు । టరయవె!
హితుడా !

నేటి స్వతంత్రపు ప్రభువులు
కోటలు విడనాడి ప్రజల । గోడు నెఱుంగన్
పేటలకు వచ్చి శ్రేయము
బాటించుట మిగుల ధర్మ । పథముర !
హితుడా !

ఓటులకై బ్రతిమాలియు
కోటలలో నేత లగుచు । గొలువుండంగా,
పేటల సేమం బరయని
మోటుల కోటీయ దలప ! బోకుము,
'హితుడా ।

జీవితము, జీవితమునకు,
జీవిత పరిమాణ మందు । జేరిచి విద్యన్
సేవించు వాడె ధన్యుడు,
భావింపుము దీని మదిని । బాగుగ, హితుడా

ఏమీ చదువెఱుగని కు
గ్రామాదుల లోని ప్రజలు । కష్టంబులతో
నా మావ శిష్టు లగుటను
నీ మదిలో దలచి చదువు । నేర్పుము,
హితుడా !

బాసలలో నన్నిట నీ
బాసకు గల ఘనత మదిని । భావించి వెసన్
దోసిలి యొగ్గుచు నక్షర
వాసన దెలియంగ శుభము । వఱలును,
హితుడా !

స్త్రీ పురుష భేద మెంచక
యోపికతో జదువు నేర్వ । నోపిన యపుడే
దాపురమగు సౌభాగ్యము
శ్రీ పురమగు మాతృభూమి । సిద్ధము,
హితుడా !

అక్షర మెఱిగిన వారు; ని
రక్షరులకు నక్షరముల । నలవరుప వలెన్
అక్షర శూన్యులు! అక్షర
కుక్షుల కడ నక్షరముల । గొనవలె,
హితుడా!

పిల్లల జదువను బంపియు
నుల్లసమునగాంచు చుండు । టుత్తమ మగు,
నా

పిల్లల భావ్యభి వృద్ధికి
దల్లియు, దండ్రియును మార్గ । దర్శులు,
హితుడా !

పర దేశాచారము తన
పరిసరమున జాలనపుడు । బాయక యున్నన్,

ధర హారతి కర్పూరము
హారియించిన రీతి చెడుట । యెరుదా ?
హితుడా !

పేదల రోదన మెఱుగక
గాదెలలో బోసికొన్న । గ్రాసము ధనికుల్
లేదని తెలుపుచు మెక్కుట
గాదే కంట్రోలు బుట్టె । కలిలో హితుడా!

దొంగ బజారులు జేసి, య
మంగళ కార్యముల దలచి । మానసమున ను
ప్పొంగెడి మోసపు మనుజులు
లొంగరె భారత స్వతంత్ర । లోలత,
హితుడా ?

లంచాలు మేయు వారే
పంచాయతి జేయ న్యాయ । భావమ్మున్నే?
కంచే చేనును మేయగ
సంచారము సలుపు నట్టి । సరణిని,
హితుడా !

పర దేశపు వస్త్రము లను
బరికించుచు రాట్నములను । బడవేయుట చే
సరిగా బట్టలు దొరకక
కఱవున గుఱియగుట నిజము । గాదా ?
హితుడా!

పరపతి కొఱకై పలువురు
జరిపెడి సహకార సంఘ । చర్యల వలనన్
ధరలో పేదల దుస్థితి
తఱుగుచు సహకార మెంతొ । దనరును,
హితుడా!

పశు సంపదగల దేశము,
కుశలముగా వఱలు చుండు । గూరిమి
తోడన్

పశు సంరక్షణ నరయుచు
పశు సంపద కొఱకు బాటు । పడవలె,
హితుడా !

పాలును, మజ్జిగ ద్రాగక;
తేలికగా దేవురించి । 'టీ' సేవకులై
చాలగ గంజికి వాచిన
మేలగునా యెర్రికైన । మేదిని, హితుడా !

రెంటికి జెడు రేవన్నల
వంటి నిరుద్యోగులుంటె । బ్రతుకంగలరా?
వంటల యెక్కువె మేల్తమ
కంటెను భూలోక మందు । గనుగొన,
హితుడా !

ఒక్కడు మాటాడెడు తఱి
జక్కగ విని బదులు చెప్ప । జాలుట
ముదమా

గ్రక్కున నొకపరి బలువురు
మిక్కుటముగ బలుకు చుంట । మేలా ?
హితుడా !

చెప్పెడు మాటలు చెవినిడి
తప్పులు గనిపెట్ట కుండ । త్వరపడ గోఱు
ర్చిప్పల వలె గనులుండియు
బప్పున గాల్వేయు నట్టి । భాతియె, హితుడా!

తగవు లవేలా కలుగును ?
తగు ధర్మము దప్పు నపుడె । తఱచుగ
గలుగున్;

తెగ దగవులాడి కోర్టుల
దగులం బెట్టంగ నగునె । ధనమును,
హితుడా !

(సశేషము)

# కేనోపనిషదు

మూలం :

స్వామి చిన్మయానందజీ

అనువాదం:

డాక్టరు W. రాధాకృష్ణయ్య



(మార్చి సంచిక తరువాయి)

## సగుణ బ్రహ్మోపాసన

నిర్ణయించ సాధ్యముకాని విషయమునుగూర్చి తెలుపుటకు ఉదాహరణములు, సామ్యములు, తారతమ్యములు, కథలు మొదలగునవి ఉపనిషత్తులందు ఉపయోగించ బడుచున్నవి. అట్లు తెలుపబడిన సామ్యములు, కథలు పరిపూర్ణా సామ్యములు కాజాలవు. సత్య విషయమును విశదీకరించ జాలవు. ఉపనిషత్తుల మంత్రములను లిఖించిన ఋషుల విజ్ఞాన చాతుర్యమువలన ఇవి తెలుపబడి యున్నవి. ఉపయోగింపబడిన ప్రతి కథయు, సామ్యమున్ను, విమర్శించబడి, వాటియందలి అంతర్భావములను శిష్యులకు ఉపయోగపడునట్లు చేయవలెను.

భక్తి మార్గమున విగ్రహముల నుపయోగించునట్లు, వేదాంతమున ఉదాహరణములు తెలుపబడుచున్నవి. దేవళమునందుండు రాతిశిల భక్తునికి పరిపూర్ణశాంతిని సుఖమును ఇవ్వజాలదు. కాని, విగ్రహములేనిది ఆత్మ ద్వారము కలుగజాలదు: విగ్రహము ఇందుకు సాధనముగ నున్నది. ఆత్మ సాక్షాత్కారము గమ్య స్థానము. గమ్య స్థానమునకు సాధనమునకు గల తారతమ్యములను గుర్తించలేక పోవుటవలన దుఃఖముల పాలగుచున్నాము.

సాధకుడు సంసారముదాటి తన ధామము చేరుటకు విగ్రహము ఒక దుముకుడు బల్లవలెయున్నది. పరమపదవి, లేక ఆత్మ సాక్షాత్కారము కలుగుటకు, భక్తుడు పరిపూర్ణ శరణాగతి పొందుటవలన, లేక చక్కని విచక్షణవల్ల సాధ్యము. తన్మూలముగ తాను ఆత్మయను విచక్షణయందు స్థిరముగ నిలువ గలుగుచున్నాడు.

ఇట్లు అసత్య సాంగత్యమును తొలగించుకొని, సత్య సాంగత్యమును చేరుటవల్ల ఆత్మ సంస్కారము కలుగుచున్నది. మనసును, బుద్ధిని, ఒక నిర్దిష్ట మార్గమున నడుపగలిగిన సాధకునికి ఈ పరిశ్రమ కుదురుచున్నది. భగవంతుని మహిమలను ధ్యానించ ఆసనమున కూర్చుని, ప్రపంచ విషయముల వెంబడి మనసును వదలువానికి అతి కష్టము కలుగును. విగ్రహము యొక్క పాదములయందు భక్తుని నిలుపగలిగి, మనసును వశపరచుకొని, ఏక మార్గమున వ్యవహరింప జేయుట ధ్యానము అనబడును. ఉదాహరణముల యందుగల గాఢ భావములయందుకూడ ధ్యానము చేయవచ్చును.

సాధకుడు, భక్తివల్లనో, కర్మవల్లనో, జ్ఞానము వల్లనో మనో ఏకాగ్రత, అంతర నిర్మలత పొందగలిగినచో, భగవంతుని కటాక్షమువలన ఆత్మసన్నిధి చేరగలుగుచున్నాడు. ఆత్మ సన్నిధియందు, భక్తునకు గల ద్వైత భావ అహంకారము పూర్తిగ లయము పొంది, ఆత్మయే తానని తెలుసుకొనుచున్నాడు. అట్లు ఆత్మతో తాను ఏకమగుటవలన, జ్ఞాని కాని, భక్తుడు గాని పరిపూర్ణత్వము, భగవంతుని స్వరూప మగుచున్నాడు.

ఈ గమ్య స్థానము చేరుటకు సాధకుడు ఏ మార్గమును అనుసరించినను వ్యత్యాసముండదు. చిరకాల సాధనవల్ల, పారమార్థిక సాధనయందు అధికముకార మేర్పడుచున్నది. అట్టిబంధనలను విదిలించి దైవ సామ్రాజ్యమును చేర్చుటకు ధైర్యము. శక్తి అవసరము. ఇట్టి కడపటి తాకుడు, ధైర్యశాలియగు సాధకునికి, సామాన్యముగ గురువునుండి కలుగుచున్నది.

సైన్యమున విమానదళమువారు విమానమునుండి దుముకుటకు నేర్చుకొనునపుడు ఎట్టి సైనికుడు గాని, విమానమునుండి అగాధమునయుండు భూమికి దుముకుటకు ధైర్యము కలిగియుండడు. అతని సోదర సైనికులు. లేక ఉపాధ్యాయుడు అతనిని క్రిందికి తోయుదురు. వెంటనే అతడు నేర్చిన విద్యనంతయు ఉపయోగించి, ప్రాణ రక్షణ చేసుకొనుచు భూమి మీద వ్రాలును. రెండుమూడు పర్యాయములు ఇట్లు ప్రోద్బలము వలన త్రోయబడగా. మరల తానుగా ధైర్యముతో దుముకుటకు సిద్ధపడును.

పరిపక్వదశ పొందిన సాధకుని, గురువు తన దయా కనికరముతో ఆత్మానుభవ సాన్నిధ్యమునకు బలాత్కారముగ త్రోయును. ఇట్లు త్రోయుట అనునది, ఉపనిషత్తు మంత్రముల వివరణవలన కలుగుచున్నది. ఉప

నిషత్తు మంత్రములందు మత సిద్ధాంతములు నిండి యున్నవి. ఉన్నత విచారము వలన, సాధకుడు వేదాంత ఆకాశమున స్వేచ్ఛగా విహరించ కలుగు చున్నాడు.

ఈ యక్షుని కథయందు గల ఇంద్రుడు ఒక పరిపక్వదశ పొందిన సాధకుడని తెలియవలెను. అట్టి వానికి శ్రీ ఉమాదేవి తానుగా, సత్యమును ఉపదేశించు చున్నది. కేవల పరోక్ష జ్ఞానమున అది బ్రహ్మమని తెలిసినంతట పరమ పదవిచేర జాలము. శాంతము లభించదు. అందువలన ఇచ్చట ఇంద్రునకు బోధించ బడని బ్రహ్మవిద్య పరిపూర్ణముగ లేదు. అతనికి శాస్త్ర జ్ఞానము మాత్రము లభించినది.

సా బ్రహ్మేతి హోవాచ; బ్రహ్మణోవా
ఏతద్ విజయే
మహీయధ్వ మితి తతో హైవ
విదాంచకార బ్రహ్మేతి॥

గురువు:—"బ్రహ్మ! బ్రహ్మయొక్క విజయమువలన మీకు కీర్తి కలిగినది." అని ఆమె పలికెను. పిమ్మట ఆ వైభవముగ కనబడిన, యక్షుడు బ్రహ్మమని అతడు ఊహించెను.

---

ఇంద్రునికి దీనివలన యక్షుని పరోక్ష జ్ఞానము లభించినది. అయినను శ్రుతి, ఇందుండు గొప్ప జ్ఞాన విశేషమును వివరించు చున్నది. బ్రహ్మ విద్య అతి శ్రేష్టమయినదని ఉపనిషత్తు ఋషులు పొగడు చున్నారు. సగుణ బ్రహ్మను సమీపింప కలిగినందు వలననే, అగ్ని దేవుడు, వాయుదేవుడు, ఇతర దేవతలలో గొప్ప గౌరవము పొందుచున్నారని, బ్రహ్మ విద్యయొక్క విశిష్టతను తెలుపుచున్నారు.

తస్మాద్వా ఏతే దేవా అతితరామి
వాన్యాన్ దేవాన్ య దగ్ని ర్వాయు
రిన్ద్రస్తే
హ్యేన న్నేదిష్టం పస్పర్శు స్తేహ్యేన
త్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి॥

అందువల్ల అగ్ని, వాయువు, ఇంద్రుడు - ఈ దేవతలు ఇతర దేవతలలో శ్రేష్టులు. ఏలన వారు (సగుణ పరబ్రహ్మమునకు) అతి సమీపమునకు వెళ్ళగలిగిరి. అతడు పరబ్రహ్మమని వారు మొదలు తెలుసుకొనిరి.

---

ఈ భావముతో బ్రహ్మ విద్యను పొగడుటవల్ల తృప్తిపొందక శ్రుతిమాత, ఇంద్రుని మరియు కొనియాడుచున్నది. ఏలన అతడు బ్రహ్మ స్వరూపమును దేవమాత యగు ఉమాదేవి వాక్కునుండి తెలుసుకొన గలిగెను.

తస్మాద్వా ఇంద్రో ఽ తితరామి వాన్యాన్
దేవాన్
స హ్యేన న్నేదిష్టం పస్పర్శ స హ్యేన
త్ప్రథమో
విదాంచకార బ్రహ్మేతి॥

మరియు ఇంద్రుడు, దేవతలలో నెల్ల శ్రేష్టుడు. అతడు యక్షునికి అతి సమీపముగ వెళ్ళ గలిగెను. అతడు యక్షుడు బ్రహ్మమని మొదలు తెలుసుకొనెను.

---

ఇంద్రుడు దేవతలలో శ్రేష్టుడయినట్లు ఆత్మను తెలుసుకొనిన సాధకుడు. శ్రుతి విచారమువల్ల ఆత్మ నిర్దిష్టము చేయగలిన సాధకుడు తన సోదరులలో శ్రేష్టత వహించు చున్నాడు. ఆత్మను గురించి విను యోగ్యత గలుగుటకు ఇందు తెలుపబడిన ఉత్కృష్ట ఇంద్ర స్థితిని పొందవలెను. తెలుసుకొనుటకు ఆతురత గలవాడు, వినయము, స్వార్థరాహిత్యము గలవాడు నిరంతర సాధనము చేయువాడు, విజయమునందు నమ్మకము గలవాడు, ఇంద్ర స్థితినీ పొందియున్నాడని తలచవలయును. అతనికి, పూర్ణ జ్ఞానియగు పావన గురువాక్యములు చెవున బడుటతోడనే పరమాత్మ ప్రత్యక్షమగుచున్నాడు.

అనుభవ ప్రారంభ దశయందు, పరమాత్మ దర్శనము చాలకాలము అనుభవింప సాధ్యపడుట లేదు. అది మెరుపులవలె వచ్చుచుండును. సాధకుడు అట్టి మెరుపులను గమనించగల సూక్ష్మత కలిగియుండక పోయినచో, అతనికి వాటి అనుభవము లేకపోవును. ఈ భావమును ప్రతిపాదించుటకు శ్రుతి రెండు ఉపమానములను తెలుపు చున్నది- వ్యక్తిగత అనుభవము, భూతముల వ్యవహారము.

తస్యైష ఆదేశో యదేత ద్విద్యుతో
వ్యద్యుత దా
ఇతీన్యమీమిషదా ఇ త్యధిదైవతమ్॥

ఇది బ్రహ్మయొక్క వర్ణన. (ఉపమానములతో)

అతడు మెరుపువలె ప్రకాశించెను. కనురెప్ప వాలు లోపల అదృశ్యుడయ్యెను. దేవతలకు బ్రహ్మకు గల తారతమ్య విచారము. (అతని జగద్వ్యాపక శక్తి.)

—o—

ఆదేశ మనగా, బ్రహ్మమును వర్ణించు ఉపమానము. ఈ ఉదాహరణము, అనుభవము ప్రత్యక్షముగా నున్నదనియు, ఆత్మదర్శనము అతి క్షణికముగ నున్నదనియు, తీవ్ర అనుభవము తెలుపుచున్నది. మెరుపుయొక్క ప్రకాశము ఒక్క క్షణముండినను, అది సర్వ వ్యాపకముగ నున్నది. అదేరీతి ఆత్మానుభవము, పరమాత్మ దర్శనము అతి స్వల్ప కాలముగ నుండినను, ఆ అనుభవము సాధకుడుతన అంతరమునందే గాక, సర్వాంతర్యామమున అనుభవించుచున్నాడు. ఆత్మదర్శన సమయమున, ఆత్మ తప్ప వేరు తెలియునది, తెలియనిది ఏమియు మిగిలియుండుటలేదు, అద్వితీయ, ఏకైక, ఆత్మ – అహంబ్రహ్మాస్మి – అను అనుభవము మాత్రము యుండును.

మరియు, కనురెప్ప మూయుట ఎంతటి స్వాభావిక, శ్రమ లేని కార్యమో యోచించవలెను. ధ్యానమును అతిక్రమించుట అంతటి సులభ కార్యమని తెలియుచున్నది. ధ్యానమునగల శ్రమయెల్ల ప్రారంభదశలోనుండును. ఈత నేర్చుకొనుటలో ప్రారంభమున నీళ్లు మింగుట తటస్థించును. కాని ఇది తొలి రోజుల అనుభవము. మరల నీటిపై సునాయాసముగ తేలవచ్చును. ఒక త్రాడుమీద నాట్యమాడు నటిక ఎన్ని పర్యాయములు క్రిందబడి గాయములు తగిలిన వెనుక వింత నటనలంతేయి ప్రదర్శించును. సాధకుడు తన తొలి ప్రయత్నమునందు, మనసును సమస్థితిలో నుంచుటకు అనేక ప్రయత్నములు చేయవలెను. కొద్ది కాలము జరుగులోగా, వమ్మకము కుదిరి, సులభముగా తనలోనికి ఎగిరిపో గలుగును. ఎట్టి ప్రయాసలేక ఆత్మ దర్శనము పొందుచుండవచ్చును.

భూత వ్యవహారముల యందుగల ఉపమానము తెలుపుటతో తృప్తిపొందక, ఆధ్యాత్మ వ్యవహార ఆదేశమును శ్రుతి తెలుపుచున్నది.

• అథాధ్యాత్మం య దేతద్గచ్ఛతీవ చ
మనోఽనేన తదుపస్మర త్యభీక్ష్ణం సంకల్పః॥

వ్యక్తిగత ఆత్మ దర్శనమును గురించి వివరము తెలుపబడు చున్నది. "బ్రహమును మనసుతో తలచునట్లు, మనసు కోరునట్లు మనో వేగముతో ఆత్మ దర్శనము పొందవచ్చును."

శ్రద్ధావంతుడగు సాధకుడు, సునాయాసముగ, అతి త్వరితముగ ఫలము పొందగలుగుచున్నాడను విషయమును మరియొక ఉదాహరణముతో ఈ మంత్రమున తెలుపబడుచున్నది. "గచ్ఛతీవ" (పోవుచున్నట్లుగ) అభీక్ష్ణం. (మరల, మరల) అనుపదములు ఈ మంత్రమున ఉపయోగింపబడి యున్నవి. ముందు విమర్శించబడియుండు ఇంద్రియ జ్ఞాన సిద్ధాంతమును ఇచ్చట అనుసరించ బడుచున్నది. చైతన్య యుక్తమగు మనసు ఇంద్రియముల ద్వారా విషయములవరకు వెళ్ళి, ఇంద్రియ ఆకారములు పొందుటవల్ల ద్రష్టకు విషయ జ్ఞానము కలుగుచున్నది.

మరియు, మనసు అచలముగ, నిశ్శబ్దముగ ఎన్నడును యుండుట లేదని అందరి అనుభవములవల్ల తెలియుచున్నది. మనసును తమోగుణమగు నిద్రవచ్చి ముంచివేయువరకు, కోరికలవల్ల కలుగు ఆలోచనల రాక్షస నృత్యము నిష్ప్రయోజనముగ జరుగుచునే యున్నది. అంతర్ముఖ నిశ్శబ్దమనగా, అనంత, పరిపూర్ణ ఆనందము దావి విషయము. దాని విషయము యోగికి మాత్రము తెలియును.

సామాన్య మానవునికి, తన శక్తి హీనతవల్లనే, భయంకర తుపానువంటి అల్లకల్లోలము అంతరమున జరుగు చున్నదని తెలుసును. వివిధ రకపు ఆలోచనలు, అలలు అలలుగవచ్చి, ఒకటికొకటి తాకుడు పొంది రూపులేక పోవుచున్నవి.

ఒక ఆలోచన ఆరంభమాయెను. పెరిగినది. ఒక క్షణము రాజ్యముచేసినది. మరుక్షణము నాశమగుచున్నది. సముద్రము అలలులేక యుండుటలేదు. అదే విధముగ ఆలోచనలు లేక మనసుండుటలేదు. ఒక ఆలోచన అణగిపోగా, వెంటనే మరొక ఆలోచన బయలుదేరి నాశమయి మరొకదానికి చోటిచ్చుచున్నది.

ఒక ఆలోచనకును, మరొక ఆలోచనకును, ఒక అంతర - మధ్య కాలము ఒకటి యుండవలెను. అట్టి కాలమెంతటి సూక్ష్మ ప్రమాణముగ నున్నను, ఉన్నదనుట నమ్మవలసియున్నది. క్రొత్త ఆలోచన ఇంకను ఉత్పత్తికాలేదు. అట్టి సమయమున మనసునందు ఆలోచనలుండవు. మనసనగా ఆలోచనల ప్రవాహము. ఆలోచనలు లేక పోయినచో మనసు లేదు. మనసు లేక పోయినచో యోగికి ఆత్మానుభవము కలుగుచున్నదని శ్రుతి తీర్మానము.

(సశేషము)

# కీ॥ శే॥ డాక్టరు కె. యన్. కేసరిగారి స్మృతి

శ్రీరామపదసేవి, శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి

కడుపారనిండిన కడుప్రేమ గృహలక్ష్మి
జనకుడై విఖ్యాతి । గనిన వాడు
ఇంటింట గృహలక్ష్మ్మ । లెల్లరు నేర్పులు
నేర్వగా గృహలక్ష్మి । నిలిపినాడు
సరసకళా ప్రౌఢి, నిరుపమానోన్నతి
చెలువొప్పగాబ్రోది । జేసినాడు
విద్యయు వినయవి । వేకముల్ పాత్రత
చెలగి ప్రదర్శింప । జేసినాడు
కేసరి గనినయీ । గృహలక్ష్మి కడుమంచి
బిడ్డరాభళియన ॥ పెంచినాడు
మంచి సోదరుడౌచు । మానినులను గౌర
వించి ప్రీతిని సత్క । రించినాడు
ఆ జన్మమాదిని । ర్యాణంబుదను కను
విద్యాభిమానియై । వెలసినాడు
తోబుట్టులకు కూర్మి తోడ సౌవర్ణకం
కణదాన మొనరించి । మనిస వాడు

కీర్తిలత సర్వదిశలబ్రా । కించినాడు
మించి సుజనులచే నుతు । ల్గాంచి నాడు
కవులువిబుధులునుతియుంప । గ్రాలినాడు
అప్పజెల్లెంద్రు మోదింప నలరి నాడు ॥

ధరణిఘన జీవితంబులో, దనరినాడు
విదపఞ్చాతిక దేహంబు । వీడినాడు
యిలనుసత్కీర్తికాయంబు । నిలపినాడు
దివిని సుఖియించుచున్నాడు । తేజమలర ॥

తానుమదినింకమును జేయ । దలచినట్టి
సత్కృతులు తనహితులచే, సమ్మదమున
మించిచేయించుచున్నాడు. మంచి దీవె
వలనుమనకునొసంగుచు । న్నాడుగాదె ॥

ఆతడు కేసరి నామ ప్రఖ్యాతపురుషు
డరయ డాక్టరు పురుష కే । సరి నృసింహ
కేసరియున నదగుగాదె । వాసిజెలగ
నామహోదార హృదయున । కరవునెందు ॥

ఆయనఘు పుత్రిగృహలక్ష్మి । యచెదు పుత్రి
కీర్తిపుత్రి యీముగురును । కీర్తనీయ
లగుచునా చంద్రతారార్క । మవనియందు
చెలగవలెనెల్లరకు ప్రీతి । వెలయవలయు ॥

నిద్దంపు పాల్గారు, ముద్దు చెక్కులపైన
నిగనిగజెలువారు । నీటుగాడు
తెలిదమ్మి గరువంబు । నలయించుకన్నుల
జల్లని చూడ్కులు జల్లువాడు
తేనెసోనలమించు । తియ్యందనమునించు
మాటల నొప్పారు మంచివాడు
పదిపదారేండువె । న్నడకముద్రనక్కస
కూటువల్ గూల్చిన । నీటుగాడు,

జేసికన్నుల వేలుపు । బిగువుమీరు
విల్లువంచిన చిన్నారి । నల్లవాడు
కూర్మిజెలువారు కౌసల్య । కుఱ్ఱవాడు
నుల్లమలరించు దశరథు । పిల్లవాడు

సీతమనసారవలచిన । చెలువువాడు
అరయజనకునినచ్చిన । యల్లువాడు
రామభద్రుండు సత్కృపా । రసముంచి.
యెల్లధర్మ సంస్థలసదా, యేలుగాత ॥

వెలయు ధర్మములవి మాకు । తెలువుగాత
ఐకమత్యంబు మాలోన । నలరుగాత
మరల శ్రీరామ రాజ్యర । మా విభవము
భరత దేశంబు శీఘ్రమే, బడయుగాత ॥

# కా మా య ని

మూలం :
శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :
శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.

(గతసంచిక తరువాయి)

మనువా మెనను సరించెను. ఆ పథికు లిరువురును వ్యోమమును చుంబించుచున్న హిమవత్పర్వతశిఖరాగ్రముల వైపు నిరాటంకగతిని పోవుచుండిరి. "పథికులారా, ఆగుడు. నన్నతిక్రమించి మీరెటకు పోవుచున్నారు? మీకు ప్రాణములపై ఆశలేదా, ఏమి?" అని హెచ్చరించుచున్నదో యనునట్లు వాతావరణము ప్రతికూలముగ మారెను. ఐనను వారు పురోగమించుచునే యుండిరి. వారలత్యున్నత స్థలమును చేరుటచే పుడమియందలి మహావస్తువులన్నియు నత్యల్పపరిమాణమున గోచరింపసాగెను. గస్తవ్యస్తానమును చేరకయునుపే మనువు అలసటనొంది భీతస్వాంతుడై యిట్లనెను "శ్రద్ధా! నీవిపుడు నన్నెచటకు కొనిపోవుచున్నావు? నాదేహము అలసటనొంది గమనాయాసమున చూర్ణమైనది. ఇక నా సాహసము సన్నగిలినది, నన్ను వెనుకకు కొనిపొమ్ము. ఈ శీతల పవనములను సహించుశక్తిగాని, మానసికవ్యథ పోరాడు సామర్థ్యముగాని నాకిప్పుడు లేవు. భోగములపట్ల వైరాగ్యము వహించి నేనిటకు వచ్చితినో, అవి బహుదూరమున లోకములో నింకను ఉండనే యున్నవి. వానికి నేనధికారిని! నేనింకను వానిని మరువలేదుసుమా! శ్రద్ధా నన్నచటికే కొనిపొమ్ము!" మోహగ్రస్తుడై త్రస్తుడై నడచుచున్న మనువునకు ధైర్యముచెప్పుచు శ్రద్ధ యిట్లనెను "మనము బహుదూరము పురోగమించినాము. ఇక భయంకర వాతచక్రములకు గడగడ వడకిపోవుటకుగాని విశ్వాసములను రుద్ధమొనర్చు శీతల పవనములకు భీతిల్లి సంకుచితుల మాటకుగాని యవసరములేదు. మనూ, చూడుము—ఇచట మనకు దేశకాలముల వివరములే తెలియుట లేదు ఇపుడు మన పాదముల క్రింద పర్వత శిఖరముల యాధారముకూడ లేకుండ మనముంటిమి! శూన్యము నొక రెక్కగను, వాయువు నొక రెక్కగను స్వీకరించి విహంగములవలె మన మెగిరిపోవలెను. అధైర్యపడకుము. మనూ, మన యాత్ర ఇంకను ముగియలేదు మనమెచ్చటికి వచ్చితిమో తెలియునా? కండ్లు తెరచి యొకసారి పరకింపుము!" అనెను పిమ్మట మనువు కండ్లు తెరచి చూడగా నతనిలో పీతముశ్చని కూర్చుండిన యశాంతి నశించినది. ప్రదేశమున గ్రహ తారా నక్షత్రములు గాని రాత్రిగాని గోచరించలేదు. ఋతువులు తిరోహితమయ్యెను. పృథ్వియు గోచరమయ్యెను. ఒక్క మాటలో చెప్పవలెనన్నచో కాలము ప్రకృతియందలి యవస్థలను నాతని దృష్టిపథమున నవిద్యమానములయ్యెను. మనువున కాచోట చూడగనే త్రిభువనములకు ప్రతినిధులుగా మూడు ప్రకాశ బిందువులు గోచరమయ్యెను. పరిదృశ్యమానములగుచున్న జ్యోతిర్బారుత్రయమును చూపుచు 'అవేమిటి'ని మనువు శ్రద్ధను ప్రశ్నించెను. మనువునకు శ్రద్ధ యిట్లు ప్రత్యుత్తర మొసగెను.

ఆ బిందువులు మూడును, ఇచ్ఛా, జ్ఞాన, కర్మలోకములు. అందు మొదటిది ఇచ్ఛాలోకము. దీనికి నలువైపులను, శబ్దస్పర్శ రూపరస గంధములను సుందర కన్యకలు రంగు రంగుల శీతాకోక చిలుకవలె మనోహరముగ నర్తనమొనర్చుచుండెను. ఆ బిందువు వీక్షణ మాత్రముననే, పరిష్వంగమువోలె హృదయమును ప్రేరణ మొనర్చి, చలింప జేయును. ఇదియే జీవన భూస్థలికి కేంద్ర ప్రదేశము. మధుర లాలసా స్పందకమైన రస తరంగధారలీ భూమిని సదా యార్ద్ర మొనర్చును. ఈ లోకవాసులు సౌందర్యాధకులు. మోహ జాలకులను విస్తృత మొనర్చి జీవులను బంధించునట్టి 'మహామాయ' ఈ లోకమును పరిపాలించును. ఇచటనే మనోజ్ఞవసంత మధు దివసములతో పాటు శిథిల శిశిరముకూడ పరదృశ్యమానమగును. ఇచటనే అమృత ఝరులుండును, విషతరంగిణులుండును. అవి రెండును ఒండొంటితో కలిసి ప్రవహించుచుండును. ఇచటి సుఖ దుఃఖములుకూడ యన్యోన్య సాంగత్యమున నేకమై పృథగ్భావము వీడి ప్రవర్తించుచుండును."

ఇచ్ఛాలోక వర్ణనమును విని మనువు "శ్రద్ధా, ఆ రెండవ బిందువు శ్యామల వర్ణముననున్న బిందువున్నదే—దాని రహస్యమునుకూడ విశదమొనర్చు" మనెను. అందులకు శ్రద్ధ యిట్లు ప్రత్యుత్తర మొసగెను.

“అది కర్మలోకము. ఆ లోక మంధకారమువలె యస్పష్టమైనది. అందు నివసించు సర్వ జీవులును నిరంతరము నేదోయొక తీరని యభిలాషతో వ్యాకుల పడుచు నిర్విరామముగా పరిశ్రమించు చుందురు. నిరంతర ప్రేరణలచే వారు కర్మ నిమగ్నులౌదురు. వారు సంతసము నభిలషించి కార్య సంలగ్నులగుదురు. కాని యాసంతసము వారికెండమావి యగును. ఇచటివారందరును యాశాలాలసులు. కాన తద్యశస్సాధనమునకై పాపకార్యముల నొనర్చుటకుకూడ వెనుదీయరు. ఇచటి ప్రజలు సర్వదా ఏదోపని నొనర్చుచు, ఫల స్వరూపమున సంతోషము లభింపక పోవుటచే, నిరాశా కశాఘాతములకు లోనౌచు నంధకారమున పరుగులిడుచుందురు. వేయేల సంతస సంఘర్ష విఫలతల కోలాహలమే ఈ లోకము నేలుచుండును......”

కర్మ లోకమును గూర్చిన భీషణ వర్ణనను విని భీతిల్లుచు “శ్రద్ధా, అత్యంత కాంతి మయమైన యీ మూడవ బిందువునుగూర్చి కొంచె మెరుక పరచుము” అని కోరెను. శ్రద్ధ దాని నిట్లభివర్ణింప సాగెను. “ప్రియతమా, ఇది జ్ఞానలోకము. ఇచటివారలు సుఖదుఃఖ భావద్వంద్వాతీతులు. ఇతడచటి పాలన కఠిన శాసన సమన్వితము. ఇచటివారలు, పరమాత్మము యొక్క ఆస్తిత్వములను తర్కించి నిర్ణయింతురు. ఇచటి జనులు తమ ప్రాప్యములను ప్రాప్తినందుదురు. కాని తృప్తియనునదిచటకూడ కానరాదు. మరు భూమిలో గ్రీష్మమునందెండిన స్రోతముల తీరములు కాంతివంతములై కానుపించునట్లు, ఇచటి జనులు వ్యాయత వైశ్వర్యమగ్నులై ఆనందములో ప్రకాశించుచున్నట్లు కానుపింతురు. కాని వాస్తవికానందమునకు దూరులైయుందురు. ఇచటి యధికారము ధర్మమును త్రాసుతో తూచి పంచబడును. ఇచటివారలు, నిరీహులై, నిష్కాములై యుండియును, దేనినో ఒక దానిని పొందియే సంతుష్టులౌదురు. ఈ జ్ఞానలోకమునందలి ప్రార్బలకు జీవనరసమును సంచిత మొనర్చుటకే గాని తదుప భోగమున కధికారములేదు. వీరు జీవనమునందు ‘సమరసతను సాధించి, వ్యాప్త మొనర్పనేతెంచిరి. కాని, విషమతనే ప్రబలిత మొనర్చుచున్నారని తోచుచున్నది. ఈ లోకీయులు, ‘ఇచ్ఛ’ నొక మిథ్యయనియు, అసత్యమనియు తిరస్కరించి తదరిక్తమైన వేరొండు మూలధ్యేయమును ప్రవచింతురు. ఈ మూడు సుఖదుఃఖములచే కేంద్రితములైనను, ఒకే తీరున నుండక ఒకదానికంటె వేరొండు భిన్నముగ నుండును.

“జ్ఞానము” దూరముగా నుండగా, “క్రియ” అన్యమార్గమును స్వీకరించగా “ఇచ్ఛ” ఎట్లు సఫలత నందును? ఈ మూడిటి పృథగ్భావమును, సమన్వయరాహిత్యమును జీవనమునకొక పెద్ద హేళన!”

ఇట్లు మూడులోకములను వర్ణించి శ్రద్ధ మందహాస మొనర్చెను. ఆ మందహాసమొక్క మహాజ్యోతి రేఖయై ఇచ్ఛాకర్మ జ్ఞానలోక బిందువుల కడకు పరుగులిడెను. ఆ మూడు బిందువులును కలిసి ఒకే బిందువయ్యెను. ఏకీభూత బిందుత్రయమునుండి ప్రకాశ జ్వాలయొక్కటి ప్రదీప్తమయ్యెను. లోకమంగంతటను, సదాశివుని శంఖడమరుక ధ్వానములు విననయ్యెను.

వెంటనే మనువు సమాధి నిష్ఠుడై, తదవస్థలో వినుపించునంత ధ్యాన శ్రవణ నిమగ్నుడయ్యెను. ఇపుడా మనువు నిజము నెరిగి శ్రద్ధాయుక్తుడై నాడు.

## 15. ఆనందము

సారస్వత ప్రదేశ నివాసులైన యాత్రికుల బృందమొకటి, ఇడను, కుమారుడిని, వెంటనిడికొని మనువును దర్శింప బయలుదేరెను. ఆ మండలితో, ధర్మచిహ్నమైన శ్వేతవృషభమొకటి యుండెను. ఆ మండలిలో స్త్రీలును, బాలురును కూడ నుండిరి. దారిలోనే బాలకులు గమనాయాసమున వ్యగ్రులైరి. అందొక బాలకుడుద్విగ్నుడై “అమ్మా, ఎంతసేపటి నుండియో మనము గమ్యస్థానము చేరుకొంటిమనియే చెప్పుచు వచ్చుచుండిరి, కాని నడచుచున్న కొలది ‘అగుట’ అను మాటనే యెత్తకుంటివి” అని ప్రశ్నించెను. ఇడ ఆ బాలకుని నచ్చజెప్ప నారంభించెను.

“నాయనా; సమస్త విశ్వమును పవిత్ర మొనర్చు నొక మహా తపస్వియొక్క శాంతి శీతల తపోవాటి మన గమ్యస్థానము.

ఐహిక తాపాగ్ని సంతప్తుడైన యొక మహాయోగి పురుషుడీ తపోభూమికి వచ్చినాడు. అతని బాధచే నీ వనముకూడ అశాంతి భరితమయ్యెను. వెదకికొనుచు వచ్చి, యతని యవస్థను చూచిన యాతని పత్ని దుఃఖితమయ్యెను. ఆ పుణ్యవతి సుశ్రూషలాతనికి వరదానమై తపోవనమంతయు ప్రశాంతముగ మారెను. పర్వతములనుండి ఝరులు ప్రవహింపజొచ్చినవి. నలువైపులను పుడమి ఆకులతో, తీవలతో కళకళ

లాడెను. ఇపుడు వారిరువురును, సర్వులకు సుఖసంతోషము నిచ్చుచు, అందరి తాపములను తాము హరించుచు లోకమునకు సేవనొనర్చుచున్నారు. వత్సా! ఆ సమీపముననే యొక నిర్మల సరోవర మున్నది. చిరకాల మనోతృష్ణలను నాశమొనర్చు నా సరోవరము పేరు "మానస సరోవరము".

బాలకుడు ఇడ సమాధానమును విని "అమ్మా! మంచిది. నీకుకూడ అలసట కల్గియే యుండును. నీ చెంతనున్న వృషభమును వాహనముగ నుపయోగించి దానిపై పయనమొనర్పక, ఏల నీవు నడచుచు, దానిని నడపించుకొని వచ్చుచుంటివి?" అని ప్రశ్నించెను. అందులకిడ యిట్లు ప్రత్యుత్తర మొసగెను. "నాయనా మనము తీర్థయాత్రికులము, మన జీవన ఘటములను పుణ్యామృత ధారలతో పూరించుకొని ధన్యులమగు తలపుతో బయలుదేరితిమి. ఈ శ్వేత వృషభము ధర్మ ప్రతీకము. అనగా ధర్మమునకొక సంకేతము. వత్సా! స్థానమును చేరిన తోడనే దానికికూడ స్వాతంత్ర వృత్తిని సంచరించుటకై స్వేచ్ఛ నిత్తును — అంతవరకిది మన చెంత నుండవలయును."

ఇంతలో యాత్రిక బృందము మానస సరోవరమును సమీపించెను. అచట చేరిన నిముసముననే వారి యలసట, తాపము వినాశమందెను. ఆ దివ్య వాటికి అగణిత సుమనోహర సుగంధ దివ్య పుష్ప విలసితము, ఒక చిన్న ప్రపంచ మనదగు నా తపోవనమున పశు పక్ష్యాదులుకూడ మహదానందము ననుభవించుచుండెను. అంతలో సంధ్యాకాలమయ్యెను. కైలాస పర్వతము సంధ్యా కాంతుల వలన కించిద్వికారమగ్నయై కూర్చున్నటులగనుపించెను. మానస సరోవర తటమున, మనువు ధ్యానలీనుడైయుండెను. అతనికి సమీపముననే శ్రద్ధ పుష్పములను చేబూని నిలచియుండెను. యాత్రికులందరును మనువును గుర్తించి, మస్తకన్యస్త హస్తులై ప్రణమిల్లిరి. అంతవరకును, ఇడతో కలసివచ్చిన కుమారుడు 'మానవుడు' శ్రద్ధ యొడిలోనికి చేరబడెను.

శ్రద్ధయొక్క చరణములకడ 'ఇడ' నతమస్తకయై ఇటులనెను. "దేవీ, నిన్ను కాంచి నేటికి నేను కృతార్థనైతిని. నీ ప్రేమ ప్రభావముననే నిన్ను దర్శించు భాగ్యము నాకు చేకూరినది! నేటివరకు నేనంధకారమున నివసించితిని! అందరిని 'భ్రాంతి'లో ముంచుట నాకు చిరాభ్యాసముగ నుండెడిది. ఇప్పుడు నా పొరబాటును నేను తెలిసికొంటినని హృదయము విప్పి చెప్పుచున్నాను. తల్లీ, ఈ పవిత్ర స్థలమున సర్వపాపములు నశించునని తెలిసికొని, సారస్వత దేశీయులమైన మేమందరము ఒక్క కుటుంబమువలె, కలసి పయనించి యీ పుణ్య భూమి కరుదెంచితిమి"

ఇంతలో మనువు కన్నుతెరచెను. మృదుతర మందహాసముతో నాతడు కైలాసపర్వతము వైపునకు సంకేత మొనర్చుచు "ఇచ్చట పాపమనునది లేదు. మీరలందరును నాయొక్క అంశములు మాత్రమే అని యెరుగుడు. ఈ పవిత్ర స్థలమున, పాపులు, దుఃఖులు, శాపగ్రస్తులు ఎవ్వరును లేరు! ఇచట అందరి జీవితములు ఒకే తీరున సమరస నిర్మలానంద భరితమైయుండును"

"అన్యులకు సేవల నొనర్చునట్టి కార్యమది పెరవారల కుపకారము మాత్రమే కాదనియు, నీ సౌఖ్యమును నిర్మించుకొను యత్నమేయనియు నెరుగుము. ఈ సువిశాల విశ్వమునందలి ప్రతి కణమును నీ యంశమేయనియెరుగుము. నీవును, విశ్వమును వేరని తలచుట పట్టి భ్రాంతి. అహంభావమను ప్రతీప శక్తి వలననే వ్యక్తి తానితరులకంటె వేరను భ్రాంతిలో పడుచున్నాడు. ఏనాడు మానవుడు సమస్త భేదభావములను సమూలముగ విస్మరించునో, సుఖదుఃఖములు రెంటిని రెండు సుందర దృశ్యములుగ భావించునో, సమస్త విశ్వమును నాదేననియు, నేనేననియు తలంచునో, ఆనాడే విశాల విశ్వమంతయు నాతని సుందరావాసమగును"

ఇంతలో శ్రద్ధ పెదవులపై మందహాసము చిందులాడినది. వాడిపోయిన పరాగములు పుష్పమునుండి విడివడినట్లు, సంసార కమలము నుండి యొక్కొక్క కణమే రాలిపోగా, తత్కాలముపై యానందమయమైన యమృత ధారలు వర్షించినవి. సుగంధిత వాయువులు వీవసాగెను. లోకమునందంతటను సౌఖ్యదీధితులముకొనెను. జీవన వేణువు స్వయముగా, మనోరథమును సంకేతమై ముక్తి పథమును సూచించుచున్నదో యనునటులు విశ్వమంతయును మంగళ మధురగానమయమయ్యెను.

అచట వెలుగొందు ప్రేమజ్యోతిచే అందరి నేత్రములును ప్రకాశితములయ్యెను. ఏ వ్యక్తి తదన్యవ్యక్తిని చూచినను, తనకును, అన్యునికిని భేదభావమే గోచరింపకపోవుటచే తామందరును ఒకే యంశము యొక్క పృథగ్రూపములమని భావింపసాగిరి. జడచైతన్య పదార్థము లొకేతీరున గోచరించెను. నలుగడలను సౌందర్యమే దృష్టిగోచరమై యందరి యందును చైతన్యము శోభిల్లుచుండగా సర్వేసర్వత్రా అఖండానందమే విరాజమానమగుచుండెను. తత్సత్

# సమ్మిళితం

శ్రీ కేగుంట మోహన్ ప్రసాదు

కడసారి దీవన లోనే
కనుపించని కాఠిన్యం.
విసుగెత్తిన జీవానికి
మరుమాట వ్యామోహం.

ఎండలో ఎండ మావులు,
వెన్నెలలోనూ ఎండ మావులు
పెను చీకటిలో ఆశాజ్యోతి,
చిరం దీపపు చిక్కని చూపు;
పెను వెలుగులో స్ఫటికపుజ్యోతి
చిన్నబోయిన దీపపు మూతి

చేజారిన పాత్రకు
మరో క్రొత్త స్థానం.
ఆదిలోన ఆలాపన -
తుదిలోన విలాపన.

మరణం పరాజయం
స్థిరత్వం మొండితనం

ఆకర్షణ అన్యాక్రాంతం,
వాంఛించేది స్వాంతం.

ఫలియించని కోరికనైనా
స్వాంతం అనుక్రమిస్తుంది.
వినుపించే వీణా రావం
కనుపించదు అదేమిటోగాని

వేరూ నిన చెట్టూ
కాలూ నిన బాలుడూ
వేరూ నని చెట్టూ
కాలూ నని బాలుడూ
నశిస్తారు – నశిస్తారు.

గీచిన చిత్రం-
పూచిన రంగూ
చిత్రంలోని రంగు
ప్రత్యేకంగా చిత్రం
సమ్మిళితం - సమ్మిళితం

---

# అటు — ఇటు

శ్రీమతి S. K. నిరుపమగురుకులు

అటు చూస్తే పప్పుపరమాన్నాలు
ఇటు చూస్తే ఆకలి ఘోషలు
ఎటుపోయినా కుక్కలజన్మధన్యమని
తల పోసాడొక క్షుద్ర జీవి వేదనగా.

అటు చూస్తే జరీ చీరల తళతళ
ఇటు చూస్తే చింకిగుడ్డల పెళపెళ
ఎటుపోయినా మధ్యతరగతికి దెబ్బని
తలపోసాడొక గృహస్థు ఆవేదనగా

అటుచూస్తే పెద్ద పెద్ద ఉద్యోగాలు
ఇటుచూస్తే తిరిపెమెత్తుగోలలు
ఎటు పోయిన కిటుకులు తెలుస్తవని
తలపోసాడొక సోమరి చింతగా,

అటుచూస్తే ఆచ్ఛాదిత కట్నాలు
ఇటుచూస్తే అందంలేని కన్నెలు
ఎటు పోయినా 'పెళ్లి' జరగదని
తలపోసిందొక ఇల్లాలుభారంగా.

అటుచూస్తే పేద్ద పేద్ద మిద్దెలు
ఇటు చూస్తే సూర్యుడుదయిస్తున్న
గుడిశెలు

ఎటుపోయినా ''అద్దె'' సమస్యచిక్కని
తలపోసాడొక ఉద్యోగి నిస్పృహతో

అటూ చూస్తే ఉపన్యాసాలు
ఇటు చూస్తే కఠిక ఉపవాసాలు
ఎటు పోయినా 'బ్రతుకుభారమని
తలపోసాడొక 'వేత్త' జాలిగా;




## ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ఇల్లరికం'

శ్రీ తాతినేని ప్రకాశరావుగారి దర్శకత్వాన నిర్మించబడిన 'ఇల్లరికం' చిత్రము పత్రికా ప్రతినిధులకు ప్రదర్శింపబడి యావదాంధ్ర దేశంలో విడుదలయింది. ఇందులో శ్రీ ఎ. నాగేశ్వరరావు, గుమ్మడి జమున, గిరిజ, హేమలత, సి. యస్ ఆర్., రేలంగి, రమణారెడ్డి మొదలగువారలు నటించారు. కథను శ్రీ సదాశివబ్రహ్మంగారు పొందికగా కూర్చారు. మాటల, పాటలు బాగున్నవి సంగీతము మనోరంజకంగానున్నది. ప్రజలను ఆకర్షించడానికని కర్రలకొట్లాటలు, నృత్య సన్నివేశాలు పొందుపరచబడినవి

ఇల్లరికమును గురించియున్న అపోహాలను, ఉబలాటాన్ని తొలగిస్తూ పిల్లనిచ్చి పుచ్చుకున్నవారి మనస్తత్వాలను, అపోహాల వలన ఏర్పడు పరిణామాలను, చెప్పుడు మాటలవలన ఏర్పడే చేటును చూపి నిజము నిలకడమీద తేలుతుందని నిరూపించిన ఇతివృత్తం.

అల్లుడుగా శ్రీ నాగేశ్వరరావు, అతని భార్యగా కుమారి జమున, జమీందారుగా శ్రీ గుమ్మడి పేర్కొన తగినట్లుగా నటించారు. గోవిందయ్యగా నటించిన శ్రీ సి. యస్. ఆర్. కడు సమర్థంగా నటించారు, శ్రీ రేలంగి, రమణారెడ్డి హాస్య నటనా చాతుర్యం సహజంగాను, సాధారణ స్థాయిని మించి రాణించింది.

ప్రజల ఆదరాభిమానములకు పాత్రము కాగల చిత్రములలో నిది పేర్కొన తగినది.

* * *

## వరలక్ష్మి పిక్చర్స్‌వారి 'వీరభాస్కరుడు'

'వీర భాస్కరుడు' జానపద చిత్రము యీ నెల 1 వ తేదిన విడుదలయినది. బ్రహ్మాండమైన సెట్టింగులతోటి, నృత్య, సంగీత సాహిత్యాలతోటి ఉత్తమ స్థాయి నందుకుంటూ తయారయిన చిత్రమిది. ఇందులోని కత్తియుద్ధాలు ప్రేక్షకులలో ఆసక్తి, ఉత్సాహాలను రేకత్తిస్తవి.

దీనికి మాటలు, పాటలు సముద్రాల జూనియర్ వ్రాశారు. నిర్మాత శ్రీ కే. బి. నాగభూషణం, దర్శకుడు శ్రీ కడారు వెంకటేశ్వరరావు.

ఇందులో యస్. వరలక్ష్మి, ఉదయకుమార్, రాజనాల, రేలంగి, కన్నాంబ, మిక్కిలినేని మొదలగువారు నటించారు.

మనోరమ, వీర భాస్కరుని భూమికలు యథోచితంగా నిర్వహించబడినవి. వీరభాస్కరుని తల్లిగా కన్నాంబ ప్రశంశనీయంగా నిటించింది. రాజనాల నటనా చాతుర్యము అభ్యుదయ మార్గంలో నడిచినది, రేలంగి సహజ ధోరణిలో నటించాడు.

సాంకేతికంగా ఉత్తమ స్థాయి నందుకున్న యీ చిత్రమున కిందుగల ద్వంద యుద్ధాలు ప్రత్యేక ఆకర్షణ. ప్రజలకు న్యాయము, ధర్మముల నుద్దేశించి సందేశమును పూరించు ఇతివృత్తంగల చిత్రమిది.

—సి. సి. పున్నయ్య

◆ ◆ ◆

స్వస్తిశ్రీవారి 'రేచుక్క – పగటి చుక్క' యీ నెల 14 వ తేది విడుదలయింది. ఇందులో యన్. టి. రామారావు, జానకి, కుచలకుమారి, రంగారావు, రాజనాల, రేలంగి మొదలగువారు నటిస్తున్నారు. దర్శకులు శ్రీ కె. కామేశ్వరరావుగారు. నిర్మాత శ్రీ నంధమూరి త్రివిక్రమరావు. రచన పముద్రాల జూనియర్. సంగీతమును శ్రీ టి. వి. రాజుగారు సమకూర్చారు.

◆ ◆ ◆

# పరిణామము

శ్రీ గాడేపల్లి శంకరం

(గతసంచిక తరువాయి)

## రెండవ రంగము

ప్రదేశము: ఒక పల్లెటూరు – రామాలయం దగ్గర రావిచెట్టు

ప్రవేశము: సెట్టిగారు : సుబ్బన్న తాత

సెట్టి:– ఈ యిచిత్రం చూశావా సుబ్బన్న తాతా! తెల్లారి లేచింది లగాయతు పొద్దుకునికే వరకూ వోట్ల గోలే గదా! స్వతంత్ర పార్టీలంట – స్వరాజ్య పార్టీలంట – జట్టీసు పార్టీలంట – జనవాణి పార్టీలంట – మనిషికో పార్టీ చొప్పున మారుపేర్లెట్టుకొని – మహా ఇరగబడి పోతున్నారు – ఈళ్ళకి ఇందులో ఏమైనా గిట్టుద్దో – యేటో!

సు. తాత:– అల్లాగేనండి మరి

సెట్టి:– మీ ఓటు మాకెయ్యండి బాబూ అంటే – మాకెయ్యంమని – ఈ బతిమాలుకోటాలేటయ్యా తాతా! ఇదంతా దేశభక్తే నంటావా? ఇంత స్వార్థ త్యాగం ఈళ్ళ కెల్లాగొచ్చిందీ అంట?

సు. తాత:– అంతే నండి మరి

సెట్టి:– అది కాదోయి యెర్రిమొగమా – రూపాయికి కనీసం కాలురూపాయి యైనా లాభంలేని యాపారం ఈ భూలోకంలో వుంటదా అని, నా పందేహం – నా మట్టుకు నేను అటువంటి యాపారం ఈ చేత్తో అంటుకోలేదనుకో?

సు. తాత:– కాదండి బాబూ మరీ!

సెట్టి:– తేనెకు సీమలు పట్టినట్టూ – బెల్లానికి ఈగలు ముసిరినట్టూ ఈ ఓటుకోసం ఈ ఒరగబడి పోటా లేటయ్యా తాత?

సు. తాత: తమరున్నా మాట నేశారండి బాబూ!

(కాంగ్రెసు వలంటీర్లు ప్రవేశిస్తారు. వెనుక మూర్తి గారు కూడా ఉంటారు)

సెట్టి:– ఇదిగో – ఈరు గాంధీ బాబులు కామోసు – ఏం బాబయ్యా – ఇలాగ దయచేసేరూ?

వలంటీరు:– సెట్టిగారూ! రేపు శాసన సభలకి ఎలెక్షన్లు జరుగుతున్నాయి గదూ – మన ఫిర్కాకు కాంగ్రెసు తరపున శ్రీమూర్తిగారు నిలబడుతున్నారు – మీ గ్రామస్థులంతా వారికే ఓటిచ్చి – కాంగ్రెసుని బలపరచాలి మరి–

సెట్టి: ఏ మూర్తిగారు బాబూ – కలకటేరు మూర్తిగారేనా?

వలం:– అవునవును – ఇదిగో వారూ వచ్చారు.

సెట్టి: ఏటీ! మన సామినాయుడుగారి కొడుకు – ఇదేటి బాబూ – ఇందులో తమరూ సేరిపోయారా? ఎంత పని జరిగిందండి బాబూ! ఎంత పని జరిగింది – మీ నాయనగారు మహా ఎక్కువైన మణిసండీ – మన తాలూకా అంతటికీ తల మానికంగా ఉండేవారు – ఏటీ! ఆరి కొమారులా బాబూ రండి రండి – నిలబడే వున్నారేంటి – ఈ బల్లమీద దయసేయండి—

మూర్తి:– ఫర్వాలేదు. సెట్టిగారు – మాకు టైముచాలదు – ఇంకా చాలా గ్రామాల్లో సంచారం చేయాల్సి వుంది.

సెట్టి:– మన జిల్లాకే తమరు ప్రభువులు – ఒక్క ఫిర్కాకే నిలబడ్డం ఏమన్నమాట – తమరు కలకటేరుగా చేసిన ఉపకారాలు – మాపెట్టిన తమరి న్యాయం ధర్మబుద్ధీ – మన జిల్లా అంతా పేరు మోగి పోయింది కదండీ!

మూర్తి:– నేనిప్పుడు కాంగ్రెస్సులో చేరి ప్రజాసేవ చేస్తున్నాను. ఆ కలెక్టరు ఉద్యోగానికీ నాకూ సంబంధం వదలి పోయి చాలా కాలమైంది.

సెట్టి:– ఏమయితే నేమండి! సింహం ఓచోట గర్జించి మరోచోట ఓండ్ర పెట్టుద్దా? నక్క ఓచోట ఊళెట్టి మరోచోట గౌరీ కళ్యాణం పాడుద్దా – సింగం సింగమే – నక్క నక్కే!

మూర్తి:– కాంగ్రెసు – మన సామాన్య ప్రజల సంస్థ. మీరు కాంగ్రెస్సుని బలపరచారు అంటే – మీ కాంగ్రెసు ప్రతినిధులు ప్రభుత్వాన్ని చేపట్టారూ అంటే – మీరే ప్రభువులన్న మాట—

సెట్టి:– చిత్తం చిత్తం! ఎంత మాట – బాబూ తెలవక అడుగుతాను – కోపగించవద్దండి. మారాజా ఆ ఇంగ్లీషువాడి బట్టలుగాని ఆడి వస్తువులుగాని ఆడి చదువులుగాని సుతరామూ పనికిరావని నాన్ కోపరేషను చేశారు గందా – మల్లి ఇప్పుడు ఆడి శాసన సభల్లోకి యెల్లి కూర్చుంటే ఏమైనా లాభం ఉంటుందా అండీ?

మూర్తి:—మంచి ప్రశ్న వేశారు సెట్టిగారూ! కొన్నాళ్ళు బ్రిటిష్‌వారితో - కాంగ్రెసువారు నాన్ కోపరేషను చేసినమాట వాస్తవమేగాని — శాసన సభ ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులతో కూడినదవటంచేతను. నామకః గవర్నరున్నప్పటికీ - పరిపాలన యావత్తూ శాసన సభల చేతనే నిర్వహింపబడుతూ వుండటం చేతను — ప్రజల హక్కులను కాపాడగల ప్రజా ప్రతినిధులుండాలనీ - బ్రిటిషువారు ఆడే ఆటకీ - పాడే పాటకీ తాళం వేసే యితర పార్టీల ప్రతినిధులు శాసన సభలకు రాకుండా ప్రతిఘటించాలనీ — మన కాంగ్రెస్సువారు ఇటీవల నిశ్చయించుకొన్నారు.

సెట్టి:—సరేలెండి! ఏదో మీబోటి మారాజులమాట అలాగుంచండి - ఆ ఇంగ్లీషువాడి ఆటకీ పాటకీ తాళం యెయ్యకపోతే - మన కాంగ్రెసు వాళ్ళకి మాత్రం యెవ్వారం ఎట్టా సాగుతదండీ?

మూర్తి:—వ్యవహారం సాగని విషమ పరిస్థితులేవస్తే - అప్పుడే తమ పదవులకు రాజీనామాయిచ్చి - ఇవతలకు వచ్చేస్తారు — అందుచేత మీరంతా కాంగ్రెస్సునే బలపర్చాలి తెలిసిందా?

సెట్టి:—చిత్తం చిత్తం మంచి మాటే సెలవిచ్చారు. తమ సెలవు ప్రకారమే జరుగుద్దిలెండి.

మూర్తి:—మరి మేము వెళ్ళివస్తాము - మాకు సెలవిప్పించండి.

సెట్టి:—చిత్తం చిత్తం - ఎంతమాట! యెల్లిరండి బాబూ జయిళ్ళకెళ్ళిన - కాంగ్రెస్సే - జయించక పోతుందా! (మూర్తీ వలంటీర్లు వెళ్ళుతారు) చూశావా సుబ్బన్న తాతా! మనసులోని మాట మరమం లేకుండా - ఎట్టా గడిగేశానో!

సు.తాత:—అయ్యో మా రాజా అడగొద్దుటండీ మాగొప్పగా అడిగేశారుండి.

సెట్టి:—చూడూ - ఒకటి ఉట్టిది — మరొకటి ఉత్తది - అయ్య దగ్గిర నేలతోంగున్నా - అమ్మదగ్గర క్రింద తోంగున్నా ఒకటేనయ్యా తాత - పదవిలోకి యెళ్లేవరకూ ఓ కబురు —పదవొచ్చిన తరువాత మరో కబురు.

సు.తాత:—అంతేనండి మరి

సెట్టి:—మన గ్రామ జమీందారున్నాడు తెలుసా?

సు.తాత:—తెలవదండీ!

సెట్టి:—అదేవిటోయి తాతా! పోయిన మాసం ఆరిచ్చిన దేవుడి మాన్యంలో, బెల్లు ఇరవలేదంటయ్యా — మనమంతాను

సు.తాత:—ఔనండి ఔనండి

సెట్టి:—మరి మన దేవుడికి మాన్య మిచ్చింది — ఆ వూరు జమీందారే కాదటయ్యా - ఆరే మన గ్రామాలకి ప్రభువు

సు.తాత:—అంతే కామోసు నండి—

సెట్టి:—చూడూ - ఆయనకూడా మనందరి ఓట్లు అడుగుతా వున్నాడు—

సు.తాత:—అలాగేనండి

సెట్టి:—సెప్పింది సాంతం యినవయ్యా సుబ్బన్న తాత

సు.తాత:—ఇంటున్నానండీ

సెట్టి:—'కాసి చేతిలో యెయ్యలేని కాంగ్రెస్సువోళ్ళకి ఓటిస్తే - ఏటి లాభం? ఏటీ?

సు.తాత:—అంతేనండి

సెట్టి:—మన జమీందారుకి మీరంతా ఓటిస్తిరా కాస్తో కూస్తో - సెయ్యితడీ - నోటితడీ కలిగే యెవ్వారం చేయిస్తాను.

సు.తాత:—అవునండి

(జమీందారు పరివారంగా ప్రవేశిస్తాడు)

సెట్టి:—ఇదేటి ప్రభువులు తమరే దయచేశారు? తమరు కాకిచేత కబురంపితే తమ ఇంటిముందు రెక్కలు కట్టుగొని వాలేవారంగందా తమరే వచ్చేశారేటి బాబూ?

జ.కా:—ఫర్వాలేదు — నీ దగ్గరనుంచి ఎంతకూ కబురు రాలేదు మరి - అందుచేత నేనే స్వయంగా బయల్దేరి చక్కావచ్చాను - మన ఫిర్కాకు శాసన సభా ప్రతినిధిగా నిలబడుతున్నాను. మన గ్రామ ప్రజలంతా — మరి మనకే ఓట్లు వెయ్యాలి — చదువూ సంధ్యాలేక - రోడ్లు ఆసుపత్రులూ - నీటి సదుపాయాలూ - ఇళ్లూ వాకిళ్ళూ లేక - మన ప్రజలు నానా అగచాట్లూ పడిపోతున్నట్లుగా మనకు తెలియవచ్చింది.

సెట్టి:—ఇంటున్నావా సుబ్బన్న తాతా!

సు.తాత:"ఇంటున్నానండి బాబయ్యా!

జ.కా:—మేమే స్వయంగా శాసన సభా ప్రవేశంచేసి — ప్రజాసేవ చేయదలచుకున్నాము — మీరంతా ఐకమత్యంతో ఉండి - పరులమాటలువిని మోసపోకుండా— మీ గ్రామాలికి ప్రభువునైన నన్నే బలపరచినట్లైతే అధోగతిలో ఉన్న మన గ్రామాల పునర్నిర్మాణానికి - మన గ్రామ ప్రజల పురోభివృద్ధికీ — అవకాశం

యిచ్చిన వారవుతారు — తెలిసిందా (సుబ్బన్న తాతను అడుగుతాడు)

సు. తాత:— తెలిసిందండి తెలిసిందండి

సెట్టి:— అయ్యో తెలవకపోవడమేటి బాబూ - సుబ్బరంగా తెలిసిపోయింది - సుబ్బన్న తాతా! ప్రభువులు ప్రజా సేవకులవుతారంట (జమీందారుతో) దాని కడ్డుందా బాబూ — తమరు మాపూరు రావటమే మాకో గొప్ప విశేషం - ఎందుకంటారా - ఎనకోపాలి — మా తాత మీ తాతగారి దర్శనంకోసం - మూడు రోజుల పూట బత్తెపు ఖర్చులెట్టుకొని - కోటకాడ పడికాపులు పడి కూర్చున్నా - ప్రభువుల దర్శనం కాలేదంట. అట్టాంటి మారాజులు - గ్రామానికి రావటం - మమ్మల్ని ఓటిమ్మని అడగటంకన్నా మాకు కావాల్సిందేటి బాబూ! ఏమంటావు సుబ్బన్న తాతా?

సు. తాత:— అంతేనండి అంతేనండి

సెట్టి:— అలాగే కానీండి బాబూ - తమలాంటివోరు — ఓ మాటంటే అడ్డుందా?

జ. కో:— చూడు — మీరు చేసిన సహాయానికి ప్రతిఫలం ఉండకపోదు సుమా? మన గ్రామాల మొత్తంమీద పదివేల ఓట్లు ఉన్నాయి కాబోలు - అవన్నీ మనకే పడేటట్టు చూడాలి.

సెట్టి:— అయ్యో దానికభ్యంతరం ఏటండీ

జ. కో:— మనం గెలవటానికి అభ్యంతరం ఉంటుందని కాదు. ఎలాగూ గెలుపు మనదే అనుకో — కాని ఎదుటి పార్టీ వాడి డిపాజిట్టు కూడా పోయేటట్టు చూడాలి - అదీ! మన ప్రజలకి మనయందుగల వినయ విధేయతలకు తార్కాణం — తెలిసిందా!

సెట్టి:— చిత్తం చిత్తం — ఇక రైటే అనుకోండి — ఇకనాట్టే మాట్లాడ నక్కర్లేదండి - తమరు మారాజులా గ కోట్లోకి రెల్లి కూకోండి - అయిందనుకోండి - అంతే గుళ్ళో ఉన్న గుండ్రాయి దేముడే కొబ్బరికాయ కొడితే — కోయని పలుకుతాడుగందా - చెయ్యి తడి చేస్తే చేయలేని పనుంటదా ప్రభూ!

జ. కో:— (రహస్యంగా సెట్టి చెవిలో) సెట్టీ ఐదు కాదు పదైనా సరే మనం వెనక తీసేదిలేదు—

సెట్టి:— అయ్యో బాబూ — నాకు తెలవదుటండీ - తమరు యేరే సెప్పాలా? — నిలుకుండే ఉన్నారు ప్రభువులు.

జ. కో:— లేదు — వెడుతున్నాను - రేపు నన్ను పోలింగు స్టేషను దగ్గర కలుసుకుంటావు కాదూ?

సెట్టి:— చిత్తం చిత్తం (జమీందారు పరివారంతో వెళ్ళిపోతాడు) ఏమయ్యా సుబ్బన్న తాతా — ఏలాగుంది సమాచారం?

సు. తాత:— ఓల్ రైటుగా ఉందండి — మరి నాకు సెలవిప్పించండి — సేనాసేపయింది

సెట్టి:— ఊ - వెళ్ళి మనవాళ్ళందర్నీ — తయారుగా ఉండమను తెలిసిందా? (ఒక వేపు వెడుతాడు)

సు. తాత:— చిత్తం చిత్తం (అంటూ మరో వేపు వెడుతాడు)

(తెర)

— వోట్ల పాట —

వోట్ ఫర్ కాంగ్రెస్
  పెద్దా పిన్నా అంతా మీరూ
  వోట్ ఫర్ కాంగ్రెస్
బీదా బిక్కీ అందరికోసం
  వోట్ ఫర్ కాంగ్రెస్
మతము కులమూ మాకులేవుగా
  వోట్ ఫర్ కాంగ్రెస్
అగ్రజాతులు హరిజనులొకటే
  వోట్ ఫర్ కాంగ్రెస్
లంచాలిచ్చి మెప్పించ లేమురా
  వోట్ ఫర్ కాంగ్రెస్
బీదలపాలిటి కల్పతరువురా?
భేదము చూపని కాంగ్రెసువాదిరా?
  వోట్ ఫర్ కాంగ్రెస్
కులము పేరుతో మతము పేరుతో
  వోట్ ఫర్ కాంగ్రెస్
కకోది పార్టీల కాతరు సేయకు
  వోట్ ఫర్ కాంగ్రెస్ !!!

(సశేషము)

# రా జ కు మా ర్

ఫ్రెంచి మూలం : ఆంటోని డెసయంట్-ఎక్సుప్యూపేరి

ఆంధ్రానుసరణ : డాక్టర్ వి. ఎస్. శర్మ



## గ్రహమండలాలలో ప్రయాణము

### 111

ఇప్పుడు రాజకుమార్ చేరుకున్న గ్రహమండలం నిజంగా వింత లోకమే అనవచ్చు. దాన్లో నివసిస్తూవున్నాయనకూడా ఆ వింత లోకానికి అనుగుణ్యమైన వింత మనిషే!

అబ్బాయి ఆయన దగ్గరకి వచ్చేటప్పటికి ఆయన ఏవేవో లెక్కలని వల్లిస్తూవున్నాడు. ఆ గొడవలో అబ్బాయి తన దగ్గిరకి వచ్చిన సంగతే గమనించాడు కాదు .....

"ఏమండోయ్ నమస్కారం! నోట్లో పొగచుట్ట ఆరిపోయినట్లుందే" అని ఆయన భుజాన్ని తడుతూ అన్నాడు.

ఆయన అబ్బాయి ప్రశ్నని వినేస్థితిలో వుంటేగా! "మూడూ రెండూ అయిదు. అయిదూ ఏడూ పన్నెండు. పన్నెండూ మూడు పదిహేనూ ... ... నమస్కారము! నమస్కారము! ... ... పదిహేనూ ఏడూ ఇరవై రెండు. ఇరవై రెండూ ఆరూ ఇరవై ఎనిమిది. ...... పొగచుట్ట సంగతా? దాన్ని తిరిగీ ముట్టించటానికి టైం వుంటేనా?...ఇరవై ఆరూ అయిదూ ముప్పయిఒకటి! కోట్లలోకి తిన్నగా ఈ మొత్తాలని తీసుకొని వెళ్లవచ్చు. అయిదువందల ఒక కోటి. ఆ మొత్తాన్ని సులభంగా ఆరువందల ఇరవై రెండు కోట్లలోకి దొర్లించుకుని వెళ్లవచ్చు! . "

"అబ్బో? కోట్లలోకేనా? అమ్మయ్యో! అయిదువందల కోట్లు! ఆరు వందలకోట్లు!" అని ఆశ్చర్యపడుతూ అబ్బాయి అన్నాడు.

"నువ్వు ఇంకా ఇక్కడే వున్నావా?... అయిదు వందల ఒక కోటి ఆరు వందల ఇరవై రెండు కోట్లు .. ఇంకా ముందుకే చక చక నడవాలి ... బోలెడుపనివుంది. దాన్ని చూసుకోలేక వుక్కిరి బిక్కిరై పోతున్నాను. నీ వంటి కుర్రకారుతో మాట్లాడుతూవుంటే చేయాలసినపని చకచక జరుగుతుందా మరి?" అని నసుక్కుంటూ అన్నాడు ఆ లెక్కలని చేస్తూవున్నాయన.

అబ్బాయికి ఇలా లెక్కలు చేయటమంటే తలనొప్పి. కాని ఆయన అంటూవున్న పెద్ద మొత్తాలని వింటూవుంటే విస్తుపోక మరేం చేయగలుగుతాడు? "అన్ని కోట్ల వరకు ఎందుకు లెక్కపెట్టాలి?" అని తనలో రేకెత్తుతూవున్న సందేహాన్ని వెలిబుచ్చాడు మన రాజుకుమార్.

ఆ ప్రశ్నకు ఆయన నసుక్కుంటూ "ఇలాటి అడ్డుదిడ్డ ప్రశ్నలంటే నాకేంనచ్చవు. ఈ గ్రహమండలం లోకి నేనువచ్చింది ఏబయి అయిదేండ్ల క్రితం. ఎన్నెన్నో లెక్కల్ని చూసుకోవాలి. రాత్రింబగళ్లు కష్టబడుతూవున్నా వాటికి అంతూ తంతూ అనేది వుంటేగా? నాకు కావలసింది కోట్ల కోట్ల మొత్తాలు వాటిని యధాతథంగా లెక్కపెట్టటానికి అన్న పానీయాలనే పూర్తిగా మానేశాను ..." అని అన్నాడు.

"ఎన్నికోట్లు చేర్చాలని!" అని ఆశ్చర్యపోతూ అబ్బాయి ప్రశ్నించాడు,

"ఇన్ని కోట్లని ఎలా చెప్పటం? అన్ని కావాలి. చిన్న మొత్తాలు కావాలి. పెద్ద మొత్తాలూ కావాలి!"

"అంత పెద్ద మొత్తాలతో ఏం చెయ్యాలని?" అని అడిగాడు అబ్బాయి.

"ఈ మొత్తాలతో ఏం చేస్తాననేగా నువ్వు అడగటం? అవి ఇక్కడవున్నవి. అక్కడా వున్నాయి" అంటూ తన చుట్టు ప్రక్కలనున్న నక్షత్రాలకేసి వ్రేలిని చూపెడూ అన్నాడు ఆ పెద్దాయాన.

"ఊ" అని తలనూపాడు అబ్బాయి.

"అన్నిటికీ నేనే యజమానిని" అని సగర్వంతో అన్నాడు ఆయన.

ఆ మాటకు విస్తుపోతూ "ఆ నక్షత్ర మండలాలకి నువ్వు ఎలా యజమాని వవుతావు?" అని ప్రశ్నించాడు అబ్బాయి.

"అవి అంతా ఎవళ్ళవని అనుకుంటూన్నావు?" అని నసుక్కుంటూ అన్నాడు ఆయన.

"ఆ సంగతి నాకేం తెలుసు. బహుశా ఎవళ్ళవీ కావనుకుంటాను" తటపటాయిస్తూ అబ్బాయి అన్నాడు.

"అలా దోవలోకి రా-ఇతర్లకి ఈ బాదరబందీ పట్టింది కాదు. వాటిని లెక్కపెడతానికి ప్రారంభించింది నేను. అంచేత అన్నీ నా లెక్కలోకే వచ్చాయి. నేనే వాటికి అక్షరాలా యజమానిని" అని అధికారపు దర్జాతో ఆయన అన్నాడు.

"అయితే కావచ్చు ... ఇంతకూ వాటితో ఏం చెయ్యాలని?" అని అబ్బాయి ఇకఇలాటి వాళ్లతో పేచీలు పెట్టుకోటం మంచిదికాదను కుంటూ అన్నాడు.

"ఏం చేస్తానా? అదంత కష్టమైన పని కాదు" అని నవ్వుతూ జవాబిచ్చాడాయన.

ఈ జవాబు అబ్బాయికి నచ్చిందికాదు. "ఎవళ్లయినా శాలువని నాకిస్తే దానిని ఒంటి మీద కప్పుకుని ఆనందిస్తాను. మంచి పువ్వు కనబడితే దానిని కోసి తిన్నగా నా వెంట తీసుకుని వెళుతాను. అలాగా నువ్వు ఈ నక్షత్రాలని కోసి మీ ఇంట్లో పెట్టుకోగలుగుతావా?" అని సూటి ప్రశ్నని అడిగాడు అబ్బాయి,

"ఊహూ" అని తలని అడ్డంగా తిప్పుతూ "అలా ఎందుకు కొయ్యాలి. బ్యాంకులో దాచుకుంటే చాలదూ మరి" అని అన్నాడు ఆయన.

"అంటే!" విస్తుపోతూ అబ్బాయి అడిగాడు.

"అంటే వాటినంతా జాగ్రత్తగా లెక్కపెట్టి, ఆ మొత్తాన్ని ఒక కాగితంమీద వ్రాసి బ్యాంక్ సేఫ్‌లో దాస్తాను."

"అలా చేస్తే సరిపోతుందా?"

"సరిపోక మరేమవుతుంది?" అని ఆయన గర్వంతో అన్నాడు.

ఇదంతా అబ్బాయికి కవనంగాతోస్తున్నది. అలా కవిత్వం అల్లేవాళ్లుకూడా వుంటారు అనుకున్నాడు. అదంతా పెద్దవాళ్లు చేసేపని. దానిమీదే వాళ్ల పెద్దరికం ఆధారపడి వుంటుంది కాబోలు! అని ఆశ్చర్యపడ్డాడు, తను ఆయన ముందు అంత చిన్నవాడా మరి?

"నాకూ ఒక పూలతోటవుంది. ప్రతిరోజూ నీళ్లు పోస్తూవుంటాను. మూడు అగ్ని పర్వతాలుకూడా నాఅధీనంలో వున్నాయి. వాటిని చూడటానికి ప్రతివారమూ వెడుతూవుంటాను. అంతేనామరి? అరిపోయిన అగ్ని పర్వతం

ఒకటి కూడా నాకు వుంది. దానిని చూడటానికి పదే పదే వెళుతూవుంటాను. నువ్వు ఇప్పుడు అన్నంతవరకు వీటికి నేను యజమాని నన్న మాట తెలిసిందికాదు. నా ఆస్తిపాస్తులను యథాతథంగా వుపయోగించుకోటం నాకు బాగా తెలుసు. ఇక నీకో? ..."అని సూటి బాణాన్ని ఆ పెద్దరికాలాయన మీద అబ్బాయి విసరాడు.

ఆ ప్రశ్నతో ఆయన హడలి పోయాడు. జవాబియ్యటానికి ఇక నోటినుంచి మాట పెగిలి వస్తేగా!

ఇలాటి మనుషులుకూడా ఈ లోకంలో వుంటారు కాబోలు అనుకుంటూ రాజకుమార్ అక్కడినుంచి తిన్నగా తిన పని చూచుకో టానికి ఇంకొక గ్రహమండలంలోకి నడిచాడు.


కేసరిగారి

శ్రీ ఫలాది పానకం

గర్భమునందు, నోటియందు మేహజబ్బులవల్ల, యితర కారణములవల్ల పుండగుట, చీము నెత్తురుతో మలము వెలువడుట, నీళ్ల విరేచనములను నివారించును. గ్రహిణిజబ్బులు, అతిసారము, కడుపునొప్పితోకూడిన జిగట విరేచనములను నమ్మకముగా కుదుర్చును.

వెల రు. 1.60

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

మద్రాసు - 14.



మెదడును చల్లబరచి

శిరోజములను నల్లబరచి

కుదుళ్లను పదిలము చేయునది

కేసరిగారి

భృంగామలక తైలము

వెల రు. 2

కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్



రాయపేట, మద్రాసు 14.

# 'పాపం బ్రద్దలైంది'

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

జగన్నాథం పరితాప హృదయంలో, శారద గతి ఏమిటి? ఆ పసివాడి బ్రతుకెలాగూ? అనే విషయాన్ని తరిచి తరిచి ఆలోచిస్తూ కకావికల పడుతున్నాడు. అతని అంతర్వాణి అనేక రీతులుగా పలుకుతోంది. ఆలోచనలు, లోతుకిపోయిన కొద్దీ కన్నీరు అప్రయత్నంగా వూరుతోంది. ఏభయ్యో పడిలోకి పడబోతున్న జగన్నాథంకి యీ విషమ పరిస్థితులేమిటి? యీ తెగని సమస్యలేమిటి? అటు సయాన తమ్ముడి భార్య - కొడుకూ దీనావస్థలోపడి, దిక్కుతోచక తికమక పడుతున్నారు. ఇటు తెలివితక్కు ప్రసంగాలతో, అసమర్థుణ్ణి చేసి, అవిశ్వాసపూరితమైనభావాల్ని వ్యక్తపరుస్తూ ఆత్మక్షోభను కల్గిస్తున్నారు. యిలాంటి అనిర్వచనీయమైన జీవిత దుర్భర స్థితిగతుల్లో జగన్నాథం ఎట్లా ప్రవర్తించటం? ఏది మంచీ? ఏది చెడూ?

దుర్గమ్మకీ నిశ్శబ్దత కాస్తంత చిరాకుని - పాత రోజుల్లో రేగి, పేరుకొనివున్న పగని - తన భర్త పక్షపాత బుద్ధిలో వున్న స్వార్థాన్ని రగిలేటట్లు చేసింది. వాస్తవంగా దుర్గమ్మ తొందరమనిషి. ఏదైనా కోరిక కల్గటమే తరువాయి, తీరేదాకా జగన్నాథాన్ని వూపుతునే వుంటుంది ఏవేవో కుంటిమాటలు మాట్లాడుతూ. ఊపిరి సలప నివ్వదు. క్షణంసేపు వూరుకోనివ్వదు. నిజంగా దుర్గమ్మకి ఎంత తొందరో - ఎంత ఆదుర్దా వుందో - ఎన్ని కోర్కెలున్నాయో - వాటికి సరిసమానంగా జగన్నాథంవద్ద పూర్తిగా మూర్తీభవించి వున్నది ఆ ఒక్క సహనమే! కొండవిరిగి మీదపడుతోందన్నా, భయపడేవాడు కాదు. దుర్గమ్మ ఎన్ని దెప్పుడుమాటలన్నా, చిరునవ్వులతో సమాధానమిచ్చి, తలొగ్గిన వాడిలా ప్రవర్తించేవాడు. భర్తని, దైవంతో సమానంగా పూజించాలని దుర్గమ్మకి తెలియకనా? తెలుసు. కాని కోపం ముక్కుమీద ఎప్పుడూ వుండటంచేత, కరుకుగా మాట్లాడుదూ, అసమర్థుణ్ణి చూసినట్లు చులకనగా చూస్తూ వుంటుందేకాని, లోకం దుర్గమ్మనే మెచ్చుకొంటూ - నెత్తికెత్తుకుంటుంది.

"మొత్తానికి చదువున్న భర్తని చేతుల్లో వుంచుకున్నావమ్మా! ప్రజ్ఞంటే నీది? ఎంత తెలివిగల దానివమ్మా! యీ కాలంలో నువ్వు కాబట్టి యీ పనిని చేయ గలిగావుగానీ, మరో ఆడదెవతయినా చేయగలుగా! ఎంత అదృష్టవంతురాలివి?"-అని అస్తమానమూ పొగిడిన వాళ్ళు పొగిడినట్లే వుంటారు. దుర్గమ్మ కలా ఎవరైనా అన్న రోజున, జగన్నాథం అంటే మరీ హీన దృష్టితో రెచ్చిపోయి, నారాయణరావు విషయాన్ని బయటికిలాగి, ప్రసంగం రూపంలోకి తెచ్చి ఎడా - పెడా తిట్టి పోస్తూండేది. మొదట్లో కొన్నాళ్ళు జగన్నాథం, దుర్గమ్మను అనేకవిధాలుగా మందలిస్తూ-మంచి వాక్యాలుచెప్పి చూశాడు. విన్నట్లే వినేది, అంతలోనే ఏమిటో విషయాన్ని గుర్తుచేసుకొని, కోపంతో చిర్రు బుర్రు లాడేది. మళ్లా 'యథా ప్రకార స్థిరస్తు' అన్నట్లయ్యేది. ఇక ఆలాంటప్పుడు జగన్నాథం మాత్రం ఏం చేయగలడు? చెప్పిన మాటలు పెడచెవినిబెట్టి, తనమనమ్మానని బయలుదేరే. కొట్టడానికి మనస్కరించేది కాదు. కావాలని చేసుకొన్న భార్యని కసాయివాడిలాగా కొట్టి చంపాలనే, విసుగుదల ఎంత హెచ్చినా, ఆ భావం కల్గించుకొనే వాడు కాదు, రవ్వంత తప్పుమాటనికూడా పల్కని వ్యక్తి. ఒకవేళ పెదవిని వృథాగా కదిలిస్తే, ఏ పరుష వాక్యం అప్రయత్నంగా - తనకి తెలియకుండా వస్తుందోనని, స్పష్టంగా మాట్లాడి వూరుకునేవాడు. ఏ విషయాన్నైనా సరే చాలా జాగ్రత్తగా ఆలోచించి, దాని లోతుపాతులు క్షుణ్ణంగా తెలిసిన తరువాతనే చేయటానికి తూగేవాడు. అనవసరంగా ప్రవర్తించి అభాసుపాలయ్యేవాడు కాదు. అందుకే వూరంతా జగన్నాథం అంటే చేతులెత్తి నమస్కరిస్తారు. దుర్గమ్మ హరిస్తుంది. యిలా వున్నప్పుడు జగన్నాథం ఏ మాట ఆధారం చేసుకొని, దుర్గమ్మతో, ప్రసంగించ గలడు? అందుకే వూరుకుండి పోయాడు. నారాయణరావు జగన్నాథం కళ్ళలో కనబడి—

"అన్నయ్యా"—అని కాళ్ళమీద పడి, చంటి బిడ్డలాగా యేడుస్తున్నట్లుగానే, జగన్నాథం తనలోతాను వూహించుకోవటం ప్రారంభించాడు. "తన భార్య సీతని, తన కుమారుని స్థితిని ఏం చేయ దల్చుకున్నావో?" నని ప్రాధేయ పడుతున్నట్లే భావించ సాగాడు. "నువ్వు చేసిన మేలుకి, నేను నీ ఆత్మ తృప్తికోసం బ్రతికున్నాళ్ళూ మంచిగా బ్రతకలేక పోయాను. నీ మాటల్ని లెఖ చేయకుండా తిరిగి చెడిపోయాను. సామూలంగా నీకు అప్రతిష్ట

కూడా వచ్చింది. నా ముఖాన్ని యిక చూపటం ఎంతో ఘోరమైన పాపమని యెంచి, క్షమించమని చనిపోయాను'' అని, తనెదుట ప్రత్యక్షమై, నారాయణరావుగోడు గోడున ఏడుస్తూ, చెప్తున్నట్లే తలపోశాడు. ఇట్లా ఎంత సేపు యోచించినా, ప్రస్తుత కర్తవ్యం ఏమిటో తేలకుండానే వుండిపోయింది.

ఇంతలో దుర్గమ్మ రెండు మూడు సార్లు యింట్లోకీ - బయటికీ కాలు గాలిన పిల్లిలా తిరిగింది. భర్తని ఎలాగైనా మాట్లాడించి, ఆయన హృదయ భావమేదో తెలుసుకోవాలని ఎత్తుగడ వేసింది. ఇంతలోకీ ధర్మారావు, అతని వెనకే జయలక్ష్మి అక్కడికొచ్చారు. వడగాలి వీస్తూనే వుంది.

"ఎవరికి వారలా ఏమీ పట్టనట్టుగా వుంటే, అక్కడ శారద గతి ఏం కావాలి?"—దుర్గమ్మ భర్త నుద్దేశిస్తూ ఎద్దేవగా అంది. ధర్మారావు తల్లివంక చూశాడు.

"రక్త సంబంధమైన తమ్ముడు పోయినంత మాత్రాన శారద పరాయిదవుతుందా? ఎవరికో ఎందుకు ఆమె అంటే జాలి కలుగుతుంది? అయిన వాళ్ళమే, ఆ స్త్రీపాస్తుల పేరిట, అసభ్యంగా ప్రవర్తించి, దూరం చేసుకున్నప్పుడు, పరాయి వాళ్లెవరో వచ్చి, శారదను ఆదుకుంటారనుకోవటం వృత్తి తెలివి తక్కువతనం".

జగన్నాథం శాస్త్రంతోటగా ఆలోచించి అన్నాడు. ఆ మాటకి దుర్గమ్మకి ముక్కుమీదికి కోపం ముంచుకొచ్చింది.

"అందుకేగా తమ్ముడొచ్చి, అడిగినప్పుడల్లా యే అడ్డు మాటా చెప్పకుండా వందలకు వందలు దోచి యిచ్చారు. నాటకాలకు కంట్రాక్టరుగా వుండి వుండి తన ఆస్తిని తెగ నమ్ముకొని, దూబరాగా ఖర్చు చేస్తుంటే, మందలించలేక, వూరుకున్నారు. వూరినిండా అప్పులు పెరిగితే, స్వార్జిత మంతా చాటుగా పట్టుకుపోయి, తమ్ముడికి ఆదుకున్నారు. కన్న కొడుకున్నాడన్న మాటకూడా లేకుండా, శాకితో మీ తమ్ముడు కబురంపినప్పుడల్లా గంపెడుత్సాహంతో, యినప్పెట్టె తెరచి, అప్పటి కప్పుడే పంపించి వేశారు యెంతుంటే అంతడబ్బుని. యివన్నీ ఎవరికీ తెలియదనుకుంటున్నారు. నా కుమారుడికి చివరికిట్లా అన్యాయం తలపెడతారని కలలోకూడా అనుకోలేదు.''—మొసలి కన్నీరు కార్చింది.

"నేను మీకేమన్యాయం చేశానసీ!" - జగన్నాథం బాధగా చూసాడు.

"చేసిందంతా అన్యాయమేగా! యింకా ఏంచేసానే! అంటారు"—దుర్గమ్మ ముక్కు చీదుతూ బవాబిచ్చింది.

"నే నెవనరికీ ఏ అన్యాయమూ మనస్ఫూర్తిగా చేయలేదు. నా తమ్ముడికి నేను సాయంచేసానూ అంటే, అది నా వ్యక్తిగత విషయం. ఆపదల్లోవుండి, అలమటిస్తూ వున్న నా తమ్ముడికి, నేను కాకపోతే యింకెవరే సహాయం చేసేది? పరాయివాళ్లెందుకు జోక్యం కల్గించుకుంటారు? నా స్వార్జితాస్తిని వాడికెందు కిచ్చారు? అని ప్రశ్నించటానికి నీకేం హక్కువుంది. నువ్వలా గుచ్చి గుచ్చి అడగటం భావ్యంకాదు. కన్న కొడుకున్నాడనే భావం నేనేమీ మర్చిపోయి, నా తమ్ముడి సంసారానికి సాయం చేయలేదు, అనవుసరంగా, నువ్వు కోపం పెంచుకోకు".—జగన్నాథం ఎంతో ఓర్పు చూపుతూ అన్నాడు. ధర్మారావు తల్లిదండ్రుల మాటలన్నీ యింతవరకూ వింటూ వచ్చాడు, తానేదైనా కల్పించుకొని అందామనుకున్నాడు. తల్లి కళ్ళతో అతని వుద్రేకాన్ని ఆపుతూవుంది. చివరకు తల్లినికూడా ధిక్కరిస్తూ, తండ్రివంక చూస్తూ "అదిగాదు నాన్నగారూ? యిచ్చినందుకు మేము ఏమీ వేరుగా భావించటంలేదు మీరంటే."

"అటువంటప్పుడు మీ తల్లీ - కొడుకులు, నా తమ్ముడంటే ఎందుకిలా విరోధ భావంతో మాట్లాడుతున్నారు?"

"ఎవరి ఆస్తి వారికి వుండగా, మీవద్ద వున్న డబ్బుని కోరటమనేది వృధాగాఎందుకు జరిగింది?"

"వృధాగా ఏమీ మా తమ్ముడు తీసుకోలేదు"

"వడ్డీకి తీసుకున్నాడా?"—దుర్గమ్మ వింతగా ప్రశ్నించింది.

"నేనేమీ మార్వాడీ వాణ్ణి కాదూ - తలకాయలు మార్చి అక్రమంగా డబ్బుకూడ బెట్టడానికి."

"అంతమాట ఎవరన్నారు? నాన్నా!"

"మీ వుద్దేశ్యం అలాగే వున్నది గదా"

"ఆ మాట ఎవన్నారండీ! వూరికే మీ వులుకు మీరు బయట పెట్టుకుంటారు."—దుర్గమ్మ సాలోచనగా అంది.

"లేకపోతే ఏమిటిదంతా? శల్య పరీక్ష చేసినట్లు మాట్లాడుతున్నారు. నా తమ్ముడికి అవసరాలకు నేను, మీకు తెలియపర్చకుండా సాయం చేస్తే, మీరది తప్పుగా ఎంచి, నన్ను చిత్రవధ చేసినట్లు చేస్తారూ! నా స్వార్జితం నేనేం చేసినా అడగటానికి మీకేం అధికారంలేదు."

"ఎందుకు లేదూ?"_ దుర్గమ్మ కోపంతో ప్రశ్నించింది.

'లేదూ..అన్నాను అంతే' జగన్నాధం ఖండితంగా మూడు ముక్కలూ అక్కడవున్న వాళ్ళ ముఖానే అనేసి, చివాల్న కుర్చీలోంచి లేచి, ముందువాలోకొచ్చాడు. యింతసేపూ తు.చ. తప్పకుండా మాట్లాడినప్పటికి జగన్నాధం ముఖంలో కోపం తారాడ లేదు. వాస్తవంగా మరో వ్యక్తికైతే, ఆ సమయంలో పట్టరానంత కోపమూ - రోషమూ - విసుగుదలా ముంచుకొచ్చేవి. అలాంటి వేమీ రాకపోవటం లోనే వుంది జగన్నాధం గొప్పదనం. ఇక వృధా ప్రసంగం పెంచటం సమంజసంగా తోచలేదు. "ఏమన్నానో అన్నాను యిక వాళ్లేమనుకున్నా తాను వినిపించుకో దల్చుకోలేదు జగన్నాధం. చేయ దల్చుకున్న కర్తవ్యం చేసెయ్యాలనుకున్నాడు." వెంటనే జయలక్ష్మి వంక చూసి___

"నా చేతి సంచీ ఎక్కడుందమ్మా?" - అని ప్రశ్నించాడు. మండిగానికి ఏటవాలుగా నిలబడి వున్న జయలక్ష్మి చరాలున అక్కణ్ణుంచి కదిలివెళ్ళి, గదిలోవున్న చేతి సంచీ తెచ్చి యిచ్చింది.

దుర్గమ్మ - ధర్మారావు, జగన్నాధంలో కలిగిన పరివర్తనకి చకితులైపోసాగారు. తల్లీ - కొడుకూ ఒకళ్ల ముఖాలొకరు వింత, వింతగా చూసుకొని తెల్లబోతున్నారు. జగన్నాధం, దణ్ణానవున్న తన బట్టల్ని గభాల్న లాగి, చేతి సంచీలో కుక్కుతున్నాడు. మామగారికి యింకేం కావాలోనని జయలక్ష్మి వేచివుంది. బట్టలు సర్దుకొని, యిల్లంతా కలియ తిరుగుతూ, మూలవున్న ఆకు జోడుని మెల్లగా తొడుక్కుంటూ___

"నా గొడుగేదమ్మా? కాస్త ఎక్కడుందో వెతికియ్యి"___అంటూ వాకిట్లోకొచ్చి నిలబడ్డాడు. అంతవరకూ, ఆ ప్రదేశంలోవున్న తల్లీ - కొడుకూ, మండువాలోకొచ్చి - జయలక్ష్మిని దగ్గరకు పిల్చి - ఏమడగాలో తెలియక - ఏం చెప్పాలో తోచక___

"కాస్త కాఫీ కాయి యీ లోపుగా త్రాగి వెడతారు"___అంటూ భర్త దగ్గిరికి వెళ్ళింది దుర్గమ్మ. జయలక్ష్మి వెంటనే కదిలి వెళ్లి కుంపటి అంటించటం మొదలెట్టింది. ధర్మారావు మండువాలో దిక్కు తోచక అటూ_యిటూ పచార్లు చేయసాగాడు.

"వెళ్లేవారు ఎలాగూ వెడుతున్నారు. కాస్త కాఫీ త్రాగి మరీ వెళ్లరాదూ! జయలక్ష్మి కుంపటి అంటించటంకూడా అయింది,"___అంటూ, తన కోపాన్ని దిగమ్రింగుకుంది.

నుదుట పట్టిన చెమటను పైవుత్తరీయంతో తుడుచుకొంటూ, జగన్నాధం కుర్చీలో కూలబడి___ భార్యవంక చూస్తూ___

"నేను, శారదను - ఆ పసివాడ్ని చూసి వద్దామని బయలుదేరాను. పోనీ, నువ్వూ రా రాదూ!"___ జాలిగా అన్నాడు.

"పదేళ్ళనుంచీ లేని యీ రాక పోకలు మళ్ళా మొదలెట్టడం దేనికిలేద్దురూ? మీరే వెళ్ళిరండి సరిపోతుంది."_మామూలుధోరణిలో అన్నా. జగన్నాధంకి, భార్య మనస్సులో యింకా, ఆ సంసారం పట్ల కోపం పోలేదన్న భావం తెలిసిపోయింది. ప్రయత్నిద్దామనే వుద్దేశ్యంతో___

"అయిందేదో అయిందిగా, యిక ఆ పాత విషయాల్ని వృధాగా తరచకు. ఒక్కగానొక్క తమ్ముడు పోయినందుకు నేనెంతగా కుందుతున్నానో తెలియదు. నువ్వంటే వాడికెంతో ప్రేమ. యీ పదేళ్లనుంచీ ముఖాముఖిగా మాట్లాడుకోపోయినా, నీ గురించి ప్రతి వుత్తరంలోనూ వ్రాస్తూవుండేవాడు. వాడి దురదృష్టానికి మనమూ కారణం! యీ సమయంలో శారదకూ_ఆ పసివాడికీ, మనం ఆశ్రయమిచ్చి, కాపాడకపోతే, యింకెవ్వరున్నారు చెప్పు. తోటికోడలిమీద నువ్వామాత్రం జాలిదల్చి ప్రవర్తించకపోతే, శారదగతి ఏంకావాలి? చెప్పు. మనమే పరాయివాళ్ళలాగా తప్పుకుపోతే, వాడి వంశం నిలబడేదెట్లా? ఆ కుటుంబ గౌరవం మాయమైపోయేలాగు చేయటం మనిద్దరికి న్యాయమేనా? శారదను దిక్కులేనిదానిగా చేసి, ఆపసివాడ్ని, మనవాడు కాదని, తూష్ణీభావంతో చూసి, లోకం కన్నుకప్పటం మనతరమేనా? అయిన వాళ్ళూరుకుంటారా? "చెట్టంత అన్నగారుండి, తమ్ముడి సంసారం చితికిపోయి చిందరవందర అవుతూంటే, చూసి వూరుకున్నాడేమిటీ?"_ అని నలుగురూ ఎత్తిపొడుపు మాటలనరూ! అను క్షణమూ ఎగతాళిగా మాట్లాడరూ! యిక తలెత్తి బ్రతికి వున్నంత కాలమూ తిరగగలమా! ఎందుకైనా మంచిది నువ్వాలోచించికూడా చూడు..."_ అన్నాడు.

జగన్నాధం దీనంగా భార్య ముఖంలోకి చూస్తూ వున్నాడు, ధర్మారావు చేస్తూ చేస్తూ వున్నపచార్లని తగ్గించుకొని, తల్లివద్దకొచ్చి—

"ఒక సారి యిలా రావే అమ్మా!"_ అంటూ ఉత్తరవేపు దొడ్డి వాకిట్లోకి దారి తీశాడు. దుర్గమ్మ కూడా వెంట ననుసరిస్తూ వెళ్లి, చతికిలబడివున్న కొడుకుముందు కూర్చుంది...

ఇంతలో జయలక్ష్మి కాఫీలు ముగ్గురికీ యివ్వటానికి బయలుదేరింది...ధర్మారావు ఏదో అనబోతుండగా_తన చేతిని, కొడుకు నోటికి అడ్డం వుంచుతూ_

"కాస్తాగు... నీ భార్య విన్నదంటే కొంపలంటుకుంటయి... అది కాఫీ తెస్తోంది... యిచ్చి వెళ్లిపోనియ్యి. చెబుదుగాని..."_అని మెల్లిగా అంది.

జయలక్ష్మి సరాసరి ముందు రెండు కంచు గ్లాసులతో, కాఫీ తెచ్చి క్రింద పెడుతూ _భర్త ముఖం వంకా, అత్తగారి ముకోపం వంకచూసి, వెనుతిరిగి చక్కాపోయి, మామగారికి కూడా కాఫీ యిద్దామని, గ్లాసు పుచ్చుకొని బయలుదేరి వసారాలోకొచ్చింది, జగన్నాధం తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.
_జయలక్ష్మి మెల్లిగా—

"మామగారూ!" అంది. జన్నాధం తలతిప్పి చూసి,_ఆమె చేతిలోని కాఫీగ్లాసు నందుకొని పెదవి దగ్గరికి చేర్చుకున్నాడు. జయలక్ష్మి అలవాటు ప్రకారం—

"పంచదార సరిపోయిందా లేకపోతే కాస్త తెమ్మంటారా?"_అంది, జగన్నాధం సాలోచనగా కాస్త కాఫీ రుచి చూస్తూ - చప్పరించి _

"సరిపోయిందమ్మా...నువ్వుకూడా అనుక్కుడు కాస్తా త్రాగు... పో"_అన్నాడు. వెంటనే జయలక్ష్మి మందువాగుండా వంటింట్లోకి వస్తుంటే, ఉత్తరవైపు గుమ్మంలోంచి ఆ తల్లీ కొడుకుల గుసగుసలు వినిపించినయి. మధ్యలో ఆగి, వినటంవల్ల అత్తగారి దురుసుమాటలికి ఆహుతి కావాల్సొస్తుందేమోనని ఎకాయకీగా కాఫీ కుంపటి వద్దకు వచ్చేసింది. తన భాగం మిగుల్చుకొన్న కాఫీని త్రాగుతూ ఒక చెవుని, అత్తగారి నోటి గట్టి మాటలకు అడ్డుగా ఉంచింది. ధర్మారావు అటూ_యిటూ చూస్తూ, తల్లితో_అంటున్నాడు—

"నాన్న అన్నమాటలు జాగ్రత్తగా విన్నావమ్మా?"

"విన్నానురా"—అంది.

"ముందు నీ అభిప్రాయమేమిటీ చెప్పు?"

"నాన్న ఫ్రూరికే శారద పిన్నిని చూడటానికి కాదు వెళ్ళేది. తమ్ముడిపట్ల వున్న అభిమానాన్ని తిరిగి పోగొట్టుకోకుండా నిలబెట్టుకునేటందుకు, లోకోపవాదాలకు గురికాకుండా, ఆ శారద పిన్నిని - ఆ పసివాణ్ణి చూసినట్లే చూసి, ఆశ్రయ మిస్తానని చెప్పి యిక్కడికి తీసుకొచ్చేందుకు బయలుదేరాడు. నిజంగా ఆమెగారే గనుక కొడుకుతోసహా వచ్చిందో నాకు దక్కే యీ ఆస్తీ కాస్తా ధ్వంసమైపోయి తీరుతుంది. తరువాత నేను చిప్పా_కర్రా పుచ్చుకొని తిరుగవలసిన గతి ఏర్పడుతుంది. యీ సమయంలో వాళ్ళ నేదోవిధంగా విడనాడుకోవడమే మంచిదనిపిస్తోంది. అయినా, ఎవరి ఆస్తీ వాళ్ళకుండగా, మనింటికి శారద పిన్నిని రమ్మంటే మాత్రం వస్తుందంటావా అమ్మా?"

"ఇంకా నీ పిచ్చిగానీ, శారద దక్కిన ఆస్తి ఏముందిరా?"

"ఏమీ లేదా?"

"ఏదో వుందిలే..."

"ఎంతా?"

"ఎంతోదాకా కూడానా! అయ్యో రామ. రెండెకరాలు మాత్రం వుంది. అదైనా చెరువు క్రింద,
మహాపండితే ఏ ఆరు బస్తాలో - ఏడుబస్తాలో వస్తయి ఎకరానికి. అంతే!"

"మిగతదంతా బాబాయే పాడు చేసాడా?"

'ఇకఇప్పుడవన్నీ దేనికిగాని. ఏం చేద్దాంచెప్పు?'

"ఎలాగూ యింక రెండెకరాలు వుంది కాబట్టి ఒక పని చేద్దాం."

"ఏమిటది?" దగ్గరగా జరిగి మరింత ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ దుర్గమ్మ ప్రశ్నించింది.

"ఆ పసి కుర్రవాణ్ణి మాత్రం ఎలాగోలాగు, శారద పిన్నిని ఒప్పించి తీసుకొని రమ్మందాం.', వాడికి సర్వ విధాలా పోషణ కర్తలం మనమేగా' అని నాన్నకు నచ్చచెప్పి, పంపుదాం. వీలయితే శారద పిన్నికూడా కొన్నాళ్ళొచ్చియుండి పొమ్మని కోరినట్లుగా చెప్పమందాం. పదేళ్ళనుంచీ వున్న పాత కక్షల్ని మర్చిపోయామని చెప్పమందాం...అప్పుడు తప్పకుండా వస్తుంది. కొన్నాళ్లు ఆశ్రయమిచ్చి 'మనా' అనే దృష్టితో ఆత్మీయంగా చూసుకుందాం.

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౪౬

శ్రీరామ మంత్రంబు చెవులకామోదంబు
సేవ్యంబు భాగ్యంబు; శ్రీకరంబు
శ్రీరామ మంత్రంబు శ్రీ మోక్షనిలయంబు
స్తవ్యంబు దురితాళి సంహారంబు
శ్రీరామ మంత్రంబు క్షేమంకరంబు, సం
సారమహావార్ధి తారణంబు
శ్రీరామ మంత్రంబు శ్రేయస్సుజ్ఞానంబు
మాన్యంబు దివ్యంబు మంగళంబు
శ్రీశుభంబు పూజ్య శ్రీరామ మంత్రంబు
మనుజ దివిజ తతుల మంతనంబు
భవ్యరామ మంత్ర పఠనంబు సతతంబు
సలుప వలయుగాదె జనములకును

౪౭

జానకీ ముఖపద్మ తే నెలఁగ్రోలెడి
మత్త భృంగం బీవు - మాన్యచరిత!
రాజుల నెల్లరి - రణమందు గెల్చి, నె
య్యంబుఁ జేకొన్న, రాజాధిరాజ ?
పాపాంధ కారంబుఁ బాఱఁద్రోలఁగ,
సూర్య
భగవానుఁడైనట్టి - పాపరహిత !
ఆజాను బాహుఁడై - యరవింద నేత్రుఁడై
శ్రీ శుభాంగము తోడఁ జెలఁగువాఁడ!
జానకీ నాథ! శ్రీరామ! సదయ హృదయ!
మాని మానస హంసమా! మాదు నిత్య
చింతలన్ బాపి రక్షింపు శ్రీవిలాస!
రమ్యగుణధామ! శ్రీ రఘురామచంద్ర!

౪౮

ఒక్క చేత బాణంబు, వేఱొక్క చేత
ధనువుదాల్చియు శ్రీ జటా ధారివగుచు
సోదరుని తోడ, భార్యతో మోదమలరఁ!
దిరుగు శ్రీరామ! జోహారు! పరమపురుష

౪౯

చారు గుణసాంద్ర! శ్రీరామచంద్ర! నిన్నుఁ
గాంచ రావణాసురు, ముఖకమల మడఁగు
జానకీనేత్రకుముదముల్ సంతసించు;
సకలజీవచకోరంబు సహజముగను
చెందు నానందమో రామ! శ్రీశుభాంగ!
నాదు మనమున విహరింపు మాదరమున

౫౦

రమ్యవేషు, సునేత్రు, పురాణపురుషు
జానకీనాథు, జగముల శౌర్యధీరు;
నఖిల చక్రవర్తుల మకుటాళి, చేత
వంద్యమౌ పాదపద్మ, శ్రీ వరు నుతింతు.

౫౧

రాజసింహాసనాధిష్ఠు, రత్నములను
భాసిలెడు పాదకమలు, సీతాసమేతు,
దేవతాసేవ్యు, శశిసూర్య దివ్యనేత్రు,
రామచంద్రుని, రఘురాము, రక్తిఁ
గొలుతు.

౫౧

వరవిశాలాక్షు, రాక్షసవంశనాశు
శిష్టజనసౌమ్యు, సుగ్రీవునిష్టసఖుని
గంగ వేద్రాశ్రయాంగు, లంకావినాశు
రామచంద్రుని, రఘురాము రక్తిఁదలతు

౫౩

వరదుఁ బద్మాసనస్థుని, భక్తజనుల
పారిజాతంబును, ప్రసన్ను, భానువంశ
తిలకు, రాజాధిరాజుఁ గీర్తిప్రకీర్ణు
రామచంద్రుని సేవింతు ప్రేమ తోడ.

౫౪ - ౫౫

విద్యాధరులు నిన్ను - వినుతించుచున్నారు
సేవించుచున్నారు దేవతాళి
గాంధర్వులెల్ల నీగానమొనర్తురు
పుణ్యస్వరూపుఁడౌ - భూరి తేజ!
అద్వైతమానంద మవ్యక్త రూపముల్
పురుషోత్తమా! నిన్నుఁబొంది యుండు
కడగంట చూపులఁ గమల, ముదముతోడ
నినుఁగాంచుచున్నది నీరజాక్ష!
రామ! పద్మాసనమున, విరాజిలెదవు;
ఆది మధ్యాంతములులేని యచ్యుతా! ము
కుంద! నినుఁజింతసేయ, మాకుందరంబె?
రక్షసేయుము సతము శ్రీరామ చంద్ర!

౫౬

మకర కుండల సద్భూషు - మందహాసు,
జగతిమిత్రు, నిందీవరశ్యాము, పీత
వస్త్రధారు, భూషిత దేహు, భాసమాను
రామచంద్రుని, రఘురాము, రక్తిఁ
గొలుతు

౫౨

పరగఁ గోదండమును దాల్చి, యరులనెల్ల
భుజ పరాక్రమోద్ధతి, రణభూమియందు
నేల మట్టంబు గావించి నెగడు చుందు
రామ! శౌర్యధైర్యోపేత! రామచంద్ర!
చారు కుండల కర్ణ! డిండీరహాస!
ధరణినాథేంద్ర! ధీర! వేదండయాన!
రాఘవా! రామభద్ర! ప్రహ్లాదవరద!
నిన్ను భజియించి సేవింతు; సన్నుతాంగ!

(సశేషము)

కడుపునొప్పి, నోట నీరూరుట,
త్రేపులు, వాంతులు, మలబద్ధకము
లాంటి అజీర్ణ లక్షణములకు
కేసరిగారి
ఆదిత్య లవణము
దివ్య ఔషధము
వెల రు. 1 - 75 న.పై.
కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు 14.

కటకరసాయనం
బాహ్య, అంతర్గత మూలవ్యాధి చికిత్సకు దివ్యౌషధము. ఇందులో ప్రమాదకరమైనట్టియు, అలవాటుకలుగజేయు ఓషధులేవియు చేరియుండలేదు. రుచికరంగాను, సులభముగా సేవించుట కనువుగానున్నది. వివరములకు:
కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్
మద్రాసు — 14.

# అషిక్ కరీబ్

టర్కీ జానపద కథ

మూలం :
మిఖెయిల్
యూర్యెవిచ్ వెర్మొంటోవ్

అనుకృతి :
శ్రీమతి పఠానేని
శ్రీశైల భ్రమరాంబ

టర్కీలో టిఫ్లిస్ అనే నగరంవుంది. ఆ నగరంలో ఒక భాగ్యవంతుడు వుండేవాడు. కోట్లకు పడగలెత్తిన ఆ సంపన్నునకు - ఆ కోట్లన్నిటిని మించిన అపూర్వ సౌందర్యవతియైన కుమార్తె వుంది. ఆమె పేరు మగుల్ మెగేరీ. అంత చక్కని చుక్క ఆ నగరంలో లేదు. అంతా ఆమెను 'దేవత' అంటూండేవారు.

ఆ నగరంలోనే అషిక్ కరీబ్ అనే యువకుడుఉండేవాడు. అతడు పేదవాడు; అతనికున్న ఆస్తి ఒక్కటే- ఉదారహృదయం, ఉన్నది ఒక్కటే విద్య-సితార్ వాయిస్తు పాటలు పాడటం. అతని కంఠస్వరం మధురాతి మధురం, అతని గానం లోక సమ్మోహనకరం.

ఎక్కడైనా పెళ్లిళ్ళు జరిగితే అషిక్ కరీబ్ అక్కడకు వెళ్ళేవాడు. సితార్ వాయిస్తు సదస్యులు ఆనందంలో మైమరచేటట్లు పాడేవాడు. ఒక వివాహంలో తుర్కిస్తాన్ వీరుల గాధలను అతడు అమృత మధురంగా గానం చేస్తున్న సమయంలో - ఆ పాటను మగుల్ మెగేరీ వింది. ఆమె హృదయంలో ఆ పాటకు అనురాగోదయమైంది. ఆ అతిలోక సౌందర్యవతి నతడుకూడా ఆ సమూహంలో గమనించాడు. ఆమె కెంపెదవులపై తోచిన మధుర దరహాస చంద్రికలను అవలోకించాడు. అతని మనస్సు సంతోషంతో పరవళ్లు తొక్కింది. తన హృదయ పీఠంలో ఆ దివ్యమూర్తిని ప్రతిష్ఠించుకొన్నాడు. అయితే- ఆమె తనకు అందని ప్రూని పండు. ఆ సంగతి నతడు గ్రహించక పోలేదు.

ఒకనాడు ఎవరి యింటిలోనో పెళ్ళి జరిగింది. అక్కడికి వెళ్ళాడు. పాటలు పాడాడు. స్వగృహానికి తిరిగి వస్తూ - దారిలోని ఒక తోటలో చెట్టు నీడను విశ్రమించాడు. చెట్లనుంచి వీచిన చల్లగాలి అతనిని జో కొట్టింది. నిద్రపోయాడు.

అదే సమయాన మగుల్ మెగేరీ చెలికత్తెలతో ఆ దారిని పోతూ అతణ్ణి చూసింది. ఒక చెలికత్తె అషిక్ కరీబ్‌ను మేల్కొలిపింది. తన ఎట్ట ఎదుట- తన హృదయాన్ని అపహరించిన అందాల బరిణెను చూసి నిరుత్తరుడైనాడు. అతని ముఖ మండాలన్ని విషాద ఛాయలు ఆవరించుకున్నాయి.

"అషికు; ఏమి-నీ విచారానికి కారణం?" అని మగుల్ మెగేరీ అడిగింది.

"నాకు విచారంకాక సంతోష మెలా కలుగుతుంది. నీకు ఏనాడో నా హృదయం అర్పించాను. కానీ నీకు - నాకు హస్తిమశకాంతం వుంది. నిన్ను పరిణయమాడే భాగ్యంలేని నిరుపేదనుగదా." అన్నాడు అషిక్

"మా నాయనను కలుసుకొని అడుగు నీకు డబ్బు లేదని బెంగ పెట్టుకోకు. నాకు మానాన్న యిచ్చే డబ్బుతో మనం సుఖంగా జీవించవచ్చు." నంది మగుల్ మెగేరీ.

"బాగానేవుంది. కాని నాకు అది యిష్టంలేదు. నేను కష్టపడి డబ్బు సంపాదించాలి. అప్పుడు నీ తండ్రిని కలుసుకోవాలి. నా మీద నీకు ప్రేమవుంటే ఒక్క వాగ్దానం చెయ్యి. నేను దేశాంతరాలకు పోతున్నాను. ఏడేళ్ళపాటు తిరిగివస్తాను. బోలెడు భాగ్యం సంపాదిస్తాను తిరిగి వస్తాను. లేదా ఎక్కడో ప్రాణం విడుస్తాను. ఏడు సంవత్సరాల వరకు ఎవరిని పెళ్ళి చేసుకోనని మాటయియ్యి." అన్నాడు అషిక్ ఆవేశంతో

"సరే! నీ కోసం ఏడు సంవత్సరాలూ నిరీ

క్షిస్తాను. నువ్వు ఏడవ సంవత్సరం చివరి రోజున గాని తిరిగి రాలేకపోతే నన్ను చాలకాలంనుంచి ప్రేమిస్తున్న ఖుర్షిద్ బేక్‌ను పెళ్లి చేసుకోవలసి వస్తుంది సుమా అని మగుల్ మెగేరీ హెచ్చరించింది.

అతను సరేనన్నాడు ఇంటికి వెళ్ళాడు. తల్లి దీవెనలందుకొన్నాడు. చెల్లితో చెప్పాడు. సితార్ తీసుకొన్నాడు. దేశాటనకు బయలు దేరాడు.

అతనితోకూడ ఖుర్షిద్ బేక్ కూడా బయలుదేరాడు. అతడు తన వెంట రావడం యిష్టంలేదు కాని రావలదని తాను ఎలా చెప్పగలడు. ఇద్దరు నాలుగైదు రోజులు ప్రయాణం చేశారు. ఇద్దరూ ఒక నది దగ్గరకువచ్చారు. అషిక్ తన ఉత్తరయం, టోపి, తీశాడు, ఒక చేత్తో సితార్ పెట్టుకొన్నాడు "నువ్వు ముందు ఈదుకుంటూ అవల ఒడ్డు చేరుకో. నీ వెనకనే నేనువస్తాను" అన్నాడు ఖుర్షిద్ బేక్.

అషిక్ కరీబ్ నీటిలో దిగాడు, ఈదుకొంటూ అవతలి ఒడ్డుకు వెళ్ళాడు వెను తిరిగి చూశాడు ఖుర్షిద్ రావడంలేదు. తన ఉత్తరీయం, టోపీ తీసుకొని వెళ్ళిపోయాడు,

తిరిగి స్వస్థానం చేరాడు. అషిక్ తల్లికి - చెల్లికి ఆ ఉత్తరీయం, టోపీ చూపించి - అతడు నదిలో మునికి చనిపోయాడని చెప్పాడు. వారు వల వల ఏడ్చారు. అషిక్ తల్లి దుఃఖ భారంతో క్రుంగి పోయింది.

మగుల్ మగేరీతోకూడా అషిక మరణించాడని ఖుర్షిద్ చెప్పాడు. కాని ఆమె నమ్మలేదు.

"కాని ఏమైనా ఏడేళ్లు గడిచేవరకు నేను మాట తప్ప"నంది ఆమె. అతని రూపాన్నే తలుసుకొంటూ రోజులు గడపసాగింది.

నదిని దాటిన అషిక ఒక గ్రామంలో వెళ్ళాడు. ఆ గ్రామ ప్రజలు అతనిని చూసి జాలి పడ్డారు. తడిసిన వశాయివదిలివేసి, వారిచ్చిన బట్టలు కట్టుకొన్నాడు. వారి ఆతిధ్యం స్వీకరించాడు. సితార్ వాయించాడు పాటలు పాడాడు వారిని మెప్పించాడు. అనేక గ్రామాలుదాటి అషిక ఖాలాఫ్ చేరాడు. ఆ నగరంలోని పాషా సంగీతాసక్తుడు. రోజూ కొత్త గాయకులను తీసుకు రావలసిందని భటులను ఆరడి పెట్టేవాడు. ఒక సత్రంలో బసచేసి, అక్కడ పాడుతున్న అషిక్ కరీబ్‌ను వారు చూసి, తమతో రమ్మన్నారు

"నేను యాత్రార్థిని. నాయిష్టంవచ్చిన చోటుకు పోతాను. ఒకచోట నేను నిలకడగా వుండను. మీ పాషా దగ్గరకు రాను" అన్నాడు అషిక. వారు వినలేదు, బలవంతంగా గొనిపోయారు. పాషా అషికను గౌరవించాడు. అతని సితార్ వాద్యం విన్నాడు. అతని గానం ఆలకించాడు. శెభాష్ అన్నాడు. మగుల్ మెగేరీ సోయగాన్ని కీర్తిస్తు తను అల్లిన పాటను వినిపించాడు. వహ్వారె వహ్వా అన్నాడు పాషా. పట్టు వస్త్రాలు _ బంగారం _ వెండి ధనం యిచ్చి బహూకరించి తన ఆస్థాన గాయకునిగా నియమించాడు.

కాల చక్రం తిరిగిపోతుంది.

అషిక నుంచి కబురులేదు. ఏడేళ్లు పూర్తికావచ్చాయి. అషిక ఆమెను మరచిపోయాడా? ఆ ప్రేమను విస్మరించాడా? టిఫ్లిస్‌కు తిరిగి వెళ్లే సన్నాహమే చెయ్యలేదు.

మగుల్ మెగేరీ నిరాశపడ్డది. అతడు యిక రాడేమో అని ఆందోళన చెందింది. ఆ సమయంలోనే వర్తకుడొకడు దేశాటనకు వెడుతున్న సంగతి తెలుసుకొని-పిలిపించి _ ఒక ఉంగర మిచ్చింది_ "ఇది అషిక్ కరీబ్ నాకిచ్చిన ఉంగరం. నువ్వు ఎక్కడెక్కడికి వెళ్ళినా యిది అందరకు చూపు. అది నాది అని ఎవరంటారు చూడు. ఒక అషిక మాత్రమే అలా అనగలడు _ అతనికి నా సంగతి జ్ఞాపకంచేసి, యిక్కడకు వెంటనే వెళ్లమను. ఏడేళ్ల సంగతి హెచ్చరించు" అనికోరింది.

వర్తకుడు తాను దర్శించిన ప్రతిగ్రామంలోను_ సరకులమ్మిన ప్రతి సందర్భంలోను ఆ ఉంగరం చూపించేవాడు. అది తమదని ఎవరూ అనలేదు. ఖాలాప్‌కు వచ్చాడు. అక్కడ అనేకులు ఆ ఉంగరం సంగతి విని _ వచ్చి చూడ సాగారు, అషిక్ కూడా వచ్చాడు.

ఆ ఉంగరం నాదే నన్నాడు ఆవేశంతో

"అషిక్! నిన్ను నేను ఎరుగుదును. నీ మగుల్ మెగేరీని మరచిపోయావా! ఏడేళ్ల గడువు పూర్తి అయితే-ఆమె ఖుర్షిద్ బేకునే పెళ్లాడుతుందని గుర్తు లేదా ?" అన్నాడు వర్తకుడు

అషిక మనస్సు చింతాక్రాంతమైంది. తుపాను రేగింది. ఎంత మందమతి నైతినని విలపించాడు. తన దగ్గరవున్న బంగారం మూట కట్టుకొన్నాడు. తాను కొన్న గుర్రంమీద బయలుదేరాడు. అహర్ని

కలం ప్రయాణం చేశాడు. ఎర్జిగాన్ కొండలు చేరుకోనేసరికి అషిక్ కరిబ్ గుర్రం అలసిపోయి ప్రాణం విడిచింది. ఎర్జిగాన్ నుంచి టిఫ్లిస్‌కు 10 రోజుల ప్రయాణం, ఇక రెండురోజులే వ్యవధివుంది. ఇక నేను టిఫ్లిస్ చేరుకోలేను. నా హృదయాధిదేవత మగుల్ మెగేరీని చేపట్టలేను. ఇక మరణమే శరణ్యం అనుకొన్నాడు. ఆ కొండనుంచి క్రిందకు దూకి ప్రాణం తీసుకొందామనుకొన్నాడు. పర్వతాగ్రంనుంచి దూకబోతున్నంతలో "ఆగు ఆగు" అని కేక వినిపించింది. పర్వతాగ్ర భాగంలో క్రింద ఒక ధవళాశ్వం కనిపించింది. ఆశ్వికుడే తన్ను పిలిచాడు.

"క్రిందకు దిగిరా!" అన్నాడతను అషిక్ మెల్లగా దిగి వచ్చాడు. "ఎందుకో ఆత్మహత్యకు పాల్పడుతున్నావు?" అని అడిగాడు.

"నేను ఒక చోటుకి వెళ్లాలి. నా గుర్రం చనిపోయింది. నా ప్రయాణం ఆగిపోయింది. నా మనస్సు భగ్నమైపోయింది. కనుకనే ఇంతపనికి ఒడిగట్టా" నన్నాడు అషిక్

"ఎక్కడికి వెళ్లాలి?" అని అడిగాడా అశ్వికుడు.

నిజం చెబితే_అంత దూరం తీసుకు వెళ్ళడేమో అని భయపడి "ఈరోజున నేను ఎర్జిరం చేరగలిగితే_తరించినట్లే" నన్నాడు "సరే! గుర్రం ఎక్కి నా వెనకాల కూర్చుని కళ్ళు మూసుకో" అన్నాడు.

అశ్వం గగన మార్గాన పయనించిందో _ వాయువేగంతోనే పరిగెత్తిందో కాని అషిక్ కన్ను తెరిచేలోకి ఎర్జిరంలో వున్నాడు.

"మిత్రమా! క్షమించు, నీతో నిజం చెప్పలేదు. నేను కార్ నగరం వెళ్ళాలి" అన్నాడు అషిక్

'ముందే నిజం చెబితే బాగుండేది కదా! సరే కళ్లు మూసుకో' అన్నాడు కొన్ని క్షణాలలో అశ్వం కార్ నగర ప్రాకారం చేరింది.

"ఉదయం ఒకసారి అబధ్ధ మాడితే ఆరోజంతా అబధ్ధాలలోనే గడిచిపోతుంది. నేను టిఫ్లిస్ చేరుకోవాలి. ఇవాళతో ఏడేళ్లు పూర్తి అవుతున్నాయి. నా ప్రియురాలు నా చేయిదాటి పోతుంది" అని నిజం చెప్పాడు, అషిక్ ముఖంలోని తిన్నదనాన్ని కళ్ళలోని దుఃఖాశ్రువుల్ని చూసి, అనుకంపతో ఆ హయారూఢుడు- "సరే! మళ్లీ కళ్ళు మూసుకో" అన్నాడు. కొన్ని క్షణాలకు టిఫ్లిస్ చేరుకొన్నాడు.

"ఆగా! ధన్యుణ్ణి. నీకు ఆజన్మాంతం కృతజ్ఞుణ్ణి కాని ఒక్క మాట! ఎర్జిగాన్‌నుంచి టిఫ్లీస్‌కు కొన్ని గంటలలో వచ్చానంటే ఎవరూ నమ్మరు. తగిన నిదర్శనకు ఏదైనా యియ్య" అన్నాడు

"సరే! ఈ శ్వేతాశ్వం కాలిగిట్ట క్రిందవున్న మన్ను కొంత తీసుకుపో, నీమాట నమ్మకపోతే ఏడేళ్లనుంచి కళ్లు కనిపించని అంధురాలి నెవరినైనా తీసుకురమ్మని ఈ మన్ను నీరు కలిపి ఆ కళ్లకు పూస్తే - దృష్టి లభిస్తుంది" అని చెప్పాడు.

అషిక్ కొంచెం మన్ను తీసుకున్నాడు. అంతే మరుక్షణంలోనే ఆ అశ్వికుడూ, ఘోటకమూకూడా మాయమైనాయి.

అప్పటికే రాత్రి ప్రొద్దుపోయింది. తన ఇంటిని వెతుక్కొంటూ వెళ్ళాడు. తలుపు తట్టాడు ఎవరు వారు అని లోపలినుంచి ఒకవృద్ధురాలి కంఠస్వరం వినిపించింది.

'బాటసారిని తల్లి! ఒక్క యీరాత్రి మీ యింటి పంచను పడుకోనిస్తే - నాక్షుధార్తి తీరడానికి కాస్త రొట్టిముక్క యిస్తే-జన్మజన్మాలకు మీకు కృతిజ్ఞుణ్ణి తల్లి' అన్నాడు అషిక్.

"అమ్మా! తలుపు తెరుస్తా" నంది అషిక్ సోదరి.

"వద్దు నీకు బొత్తిగా నామాట తలకెక్కడంలేదు ఏడేళ్లైె నాకొడుకు వెళ్లిపోయినప్పటినుంచి ఏడ్చిఏడ్చి నా కళ్లు కాయలుకాసి, గ్రుడ్డిదాన్నయినాను. నీ యిష్టంవచ్చినట్లు సంచరిస్తున్నావు." అందితల్లి.

అయినా ఆమె తలుపు తెరచింది. అషిక్ లోపలికివచ్చి - "అమ్మా! కాస్త రొట్టె" అన్నాడు. ఆతనిసోదరి రొట్టె తెచ్చియిచ్చింది. ఆరగించి, తనకాడ తీగల ఫిడేలునుచూసి "అమ్మా! ఆ గోడనున్నదేమి?" అన్నాడు

"రొట్టె అడిగావు. పెట్టాం చాలు. ఓ మూల పరుండి తెల్లవారగానే లేచిపో. ఊళ్ళో గొప్పవారియింట పెళ్లి అవుతోంది. అక్కడికిపోతే కడుపు నిండే తిండి దొరికేదికదా! మమ్మల్ని పీడించడం దేనికి?" అంది వృద్ధురాలు.

"నా తల్లి అని నిన్ను ముందే సంబోధించాను..

దేశాటన చేస్తున్న నీ కొడుకు అన. ఒకసారి ఆ చరిత్రాన్ని బరగి, ఎక్కడో పెళ్లి అవుతోందన్నావు. అక్కడకుపోయి - నీ కొడుకు అషిక్ వలెనె పాటలు పాడి - అక్కడ వారిచ్చినది మీకు తెచ్చియిస్తా. ఆ యింటికి దారి చూపడానికి నా చెల్లిని పంపు" అన్నాడు అషిక్.

"నీ గొంతు నా కొడుకు గొంతువలెనే వుంది. నీ పేరేమి?" అంది ఆమె.

"రషీద్. ఇదిగో ఈ బంగారు నాణెముల మూట నీ దగ్గర హాయిగా పెట్టుకో. ఆ పిడేలు నా కొక్కసారి యిమ్మని నా చెల్లితో చెప్పు." అన్నాడు అషిక్.

ఆ బంగారు నాణెములు చేతితో తాకి చూసి ఆమె సరే అంది. చెల్లెలు ఆ ఫిడేల్ తీసి యిచ్చింది. ఒకసారి తీగెలు మీటి చూశాడు.

"ఇవాళ మగుల్ మెగేరీ ఖుర్షిద్ బేక్‌కు పెళ్ళాడ బోతోంది" అంది చెల్లి.

"సరే దారిచూపు తల్లి" అన్నాడు.

అక్కడకు వెళ్ళగానే_"సలామాలేకుం. ఇక్కడ మీరంతా పెళ్లివిందు చేసుకొంటున్నట్లుంది. పేద గాయకుడను నా పాట వినండి. ఆనందించండి" అన్నాడు అషిక్.

"సరే! పాడు!" అన్నాడు ఖుర్షిద్ - లోపల తెరవెనుక మగుల్ మెగేరీ తన చెలికత్తెలతో కూర్చుని వుంది. దగ్గరనే విష పాత్ర _ ఒక చాకు వున్నాయి

"అషిక్ రాలేదు. ఖుర్షిద్‌ను పెళ్లాడడం నా కిష్టంలేదు. ఈ విషంత్రాగో, ఈ బాకుతో పొడుచుకొనో ప్రాణం తీసుకొంటాను" అంది మగుల్ మెగేరి

బయట అషిక్ శృతి సరిచేసుకొన్నాడు.

"ఖాలాత్ నగరంలో కడు సుఖ పడ్డాను. దేవుడిచ్చిన రెక్కలతో ఎగిరి వచ్చినాను!" పాడాడు.

"అబద్ధం! ఖాలాత్ నుంచి ఎగిరి వచ్చావా?" అన్నాడు ఖుర్షిద్ తమ్ముడు.

"ఉదయం ఎర్జిగాన్‌కు
మధ్యాహ్నం ఎర్జిరమ్‌కు
రాత్రి టిఫ్లీస్‌కు
రా గలిగిన కారణమ్ము
వాయువేగ గమనముగల
వారువమే సాధనమై
వచ్చితి నీ వేళకో మగుల్
మెగేరీ పెండ్లి చూడ......"

ఆ పాట నాలకించిన మగుల్ మెగేరీ మూర్ఛిల్లింది చెలికత్తెలు సేదదీర్చగా _ 'అతడే అషిక్. అన్న నాటికి వచ్చాడు' అంది ఆనందావేశంతో.

ఖుర్షిద్ చే అతడు అషిక్ కరిబ్ గా గుర్తించాడు.

"సరే! నువ్వు అషిక్ వే కాని ఖాలాఫ్ నుంచి ఎలా ఇంత త్వరలో రాగలిగావు? మాకు నిదర్శనం చూపు" అన్నాడు ఖుర్షిద్:

"ఏడేళ్లుగా కళ్లు కానరాని అంధురాల్ని తీసుకో రండి" అన్నాడు అషిక్. అక్కడేవున్న అతని చెల్లి యింటికి పరుగెత్తి "అమ్మా! ఇప్పుడు మన ఇంటికి వచ్చినది అన్నే" నంది - ఆమెను తనతో అక్కడకు తీసుకు వెళ్లింది.

అషిక్ తన జేబులోని మన్ను తీసి, నీరు కలిపి - తల్లి కన్నులకు పూశాడు-ఆశ్చర్యం! ఆమె స్పష్టంగా చూడగలిగింది. అంధత్వం తొలగింది.

"సరే! సరే మగుల్ మెగేరీని నువ్వే పెళ్లిచేసుకో" అన్నాడు ఖుర్షిద్ బేక్ నిరాశగా

"ఖుర్షిద్! నువ్వు నిరాశపడవలదు. మగుల్ మెగేరీతో సమమైన అందంకలది నా చెల్లి. ఆమెను నీ కిచ్చి పెళ్ళి చేస్తా" నన్నాడు అషిక్.

అతడు సమ్మతించాడు. ఆ సమయంలోనే రెండు పెళ్లిళ్ళు జరిగాయి.

—(o)—

ఆంధ్రదేశమంతటా జైత్రయాత్ర
చేస్తున్నది



# శ్రీ సాయి భక్త సమాజంలో శ్రీరామ నవమి ఉత్సవం



మద్రాసు – షెనాయ్ నగరమందు సాయినిలయంలో ఏప్రెలు 16, 17 తేదీలలో శ్రీరామనవమి ఉత్సవము భక్తుల ఆనందోత్సాహముల మధ్య వైభవోపేతముగా జరిగెను. రామనామ సంకీర్తనము, భజనలతో జరిగిన యీ ఉత్సవములో వేలకొలది భక్తులు పాల్గొనిరి. 16వ తేది నాడు షుమారు నాలుగువేల మంది బీదలకు అన్న ప్రదానము జరిగెను.

విద్యుద్దీపాలతోటి, తోరణములతోటి అలంకరింపబడిన పందిట అలంకరించబడిన శ్రీరామ, సాయిబాబా పటముల సమక్షమున శ్రీ కే. యస్. రామస్వామి శాస్త్రిగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగెను.

శ్రీ సాయిబాబా భక్త సమాజం అధ్యక్షుడు శ్రీ యం. రామానుజాచారిగారు స్వాగతము చెప్పుచు యిప్పటి వరకు స్వామి కేశవయ్యాజీ నిర్వహిస్తూ యుండిన పూజారాధనలు, సేవా కార్యక్రమములు యికముందు శ్రీ సాయిబాబా భక్తసమాజము ద్వారా నిర్వహించబడునని యు, అందుకుగాను ఒక మందిర నిర్మాణము సయితము తలపెట్ట బడినదనియు, సహజపు సభ్యత్వ రుసుము నెలకు 50 నయాపైసాలు మాత్రమేననియు, భక్తులు విరివిగా సభ్యులై శ్రీ సాయిబాబా మందిర నిర్మాణమునకు సహాయ సహకారములతో తోడ్పడవలసి యున్నదనియు విజ్ఞప్తిచేసి అనివార్య కారణములవలన ఉత్సవ కార్యక్రమమునకు అధ్యక్షత వహించవలసిన మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారు రాజాలక పోవుటచే శ్రీ రామస్వామి శాస్త్రిగారిని అధ్యక్షత వహించి కార్యక్రమమును జరుపవలసినదిగా కోరిరి.

శ్రీ స్వామి కేశవయ్యాజీ తన దివ్యసందేశములో అవతార పురుషుడైన శ్రీ రామచంద్రుని జన్మదినము మనకు మహా పర్వదినమనియు, ఆయన మహోజ్వలమైన, ఆదర్శనీయమైన జీవితము మానవ జీవయాత్రను ఉత్తమోత్తమముగా రూపొందించునదనియు, శ్రీరామనామ తారక మంత్ర స్మరణ యిహపరములలో మానవునకు సుఖసౌభాగ్యములను సమకూర్చ గలదనియు, శ్రీ సాయిరాం నామస్మరణవలన సకల పాపములు పరిహారమయి తరించుటకు మార్గమనియు వివరించిరి.

శ్రీ యస్. పి. రాధాకృష్ణ నాయుడు (రిటైర్డ్ ఐ.ఎ.ఎస్.) ఉపన్యసిస్తూ స్వామి కేశవయ్యాజీని తన జూనియర్ ఆఫీసరుగా చాలకాలమునుండియు తెలియుననియు, అధికారిగా అనధికారిగా కూడ నిజాయితీ, ధర్మం న్యాయముల నాధారంగా జీవయాత్ర గడుపుతున్న సత్యశీలుడనియు, అవియే భగవంతుని ప్రీతిపరచి స్వామీజీకి దివ్యత్వమును ప్రసాదించినవనియు, దానితో నిష్కామిగా వారు నిర్విరామంగా మానవ సేవచేయుచు శ్రీ సాయిబాబా సందేశమును పూరిస్తూ లోక కళ్యాణమును ప్రోత్సహించు చుండుట మహా విశేషమనిరి.

శ్రీ చిత్తూరు వి. నాగయ్యగారు ఉపన్యసిస్తూ రామనామ ప్రభావమును గురించి వివరించిరి. తానీనాడు యీ సమావేశంలో పాల్గొన జాలనేమోనని చివరిదాకా అనిపించినా, శ్రీ బాబా నిర్ణయం, అనుగ్రహమువలన పాల్గొన గలిగితినని, తాను శ్రీ సాయి భక్తుడుగా అనుభవించుచున్న ఆత్మానందము, మనశ్శాంతి, సంతృప్తిని వెల్లడించిరి.

శ్రీ టి. ఎ. రామస్వామి రెడ్డియార్ శ్రీ సాయిబాబా జీవిత చరిత్రలోని కొన్ని సంఘటనలను, సన్నివేశములను వివరించుచు శ్రీ బాబా బోధనల ననుసరించి ఆధ్యాత్మిక, పారమార్థిక చింతలను ప్రోత్సహించి భక్తులకు మానసిక, శారీరక స్వస్థతను సమకూర్చుచున్న దివ్య పురుషుడు స్వామి కేశవయ్యాజీ అని జోహారు లర్పించిరి.

గృహాలక్ష్మి సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్య ఉపన్యసిస్తూ ఇంతకాలం స్వామి కేశవయ్యజీ నిర్వహిస్తున్న పూజారాధనాది కార్యక్రమాలు యికముందు శ్రీ సాయి బాబా భక్తి సమాజం ద్వారా జరుగనుండుటచే కులమత వర్గాల కతీతంగా ఏకోన్ముఖులై భక్తులు పరస్పర సద్భావ, ప్రేమ, సమరస సమైక్యతలతో భక్తి విశ్వాసముల నలవరచుకొని తరించగలరనియు, ప్రపంచములో యీనాడు కావలసినదే యది యనిరి. శ్రీ రామాయణం, భారతంలాంటి పవిత్ర గ్రంథముల రచన మహా ఋషులచే వారి దివ్య దృష్టి పురస్సరంగా నైతిక పతనావస్థలో నున్న మానవ లోకాన్ని ఉద్ధరించుటకనే యుద్దేశించబడినదనియు, వాని విలువను విశాల దృక్పథంతో అర్థంచేసికొని స్వీయ సౌభాగ్యమునకు వినియోగించుకొనుట విజ్ఞత కాని, అరకొర విజ్ఞానంతో విమర్శించడమో, నిందించడమో సమంజసము కాదనిరి. శ్రీ స్వామి కేశవయ్యజీ ద్వారా తమకు బాబా అనుగ్రహ కటాక్షములు నిత్య జీవితములో తోడ్పడుతూ జీవం పోస్తున్నవని, ఆపదలోను, కష్టాలలోనున్న దీనుల మొరలను శ్రీ సాయిబాబా ఆలించి పాలించి రక్షించుచున్నాడనియు, అట్టి రక్షణ లభించక పోయినచో కారణము సాధకుని శ్రద్ధా భక్తుల లోపమే కాని మరొకటి కాదని రూఢిగా చెప్పవచ్చుననిరి.

శ్రీ రామస్వామి శాస్త్రిగారు అధ్యక్షోపన్యాసములో శ్రీ రామాయణ, భగవద్గీతలాంటి పవిత్ర గ్రంథాల ఉత్కృష్టతను వివరించుచు అవతార పురుషులుగా శ్రీరాముడు, శ్రీ కృష్ణుడు కలియుగంలో న్యాయ, ధర్మ, సత్యమార్గాల స్థాపకు లయ్యారనియు, శ్రీ సాయిబాబా సయితం అవతార పురుషుడగుటచే ప్రజలలో న్యాయము, ధర్మము, ప్రేమ, భక్తి విశ్వాస, సేవా త్యాగములను వ్యాప్తి నొందించుటకు కృషి చేసిరనియు, వారి అడుగు జాడల ననుసరిస్తున్న స్వామి కేశవయ్యజీ కడు ధన్యులనిరి.

శ్రీ టి. చంగల్వరాయ పిళ్లైగారు ఉత్సవంలో పాల్గొనిన భక్తులను, ఉపన్యాసకులను అభినందించి శ్రీ సాయిబాబా మందిర నిర్మాణమునకు తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేసిరి.

శ్రీ టి. చెంగల్వరాయన్ గారు మాట్లాడుతూ శ్రీ సాయి మందిర నిర్మాణంలాంటి ఉపయుక్తమయిన, ఉత్తమ కార్యక్రమాలు ప్రోత్సహించవలసినవని, పురపాలక సంఘమే స్వయముగా కోరిన నిలమును మందిర నిర్మాణమునకు మంజూరు చేయవలసియున్నదనియు, తాము అవసరమైతే ప్రభుత్వ వర్గాలలో పలుకుబడిని వినియోగించి శ్రీ సాయిమందిర నిర్మాణమునకు సర్వ విధాల తోడ్పడెదనని వాగ్దానము చేసిరి.

శ్రీ సాయిబాబా మందిర నిర్మాణమునకుగాను బెంగుళూరునుండి ఒక భక్తుడు పంపిన రు. 5005/- చెక్కు కోశాధికారికి అందజేయబడెను.

శ్రీ స్వామి కేశవయ్యజీ పంచిపెట్టిన విభూతి ప్రసాదముతోబాటు భక్తులకు వడపప్పు, పానకం, లడ్డుండలు, అరటిపండ్లు పంచిపెట్టబడెను.

...o...

పండిత డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్, మదరాసు-17.
Grihalakshmi - May- 59.

# బ్లూ లెటర్

**శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A.**



అయితే మీ ఆఫీసులోనూ వున్నారన్నమాట లేడీ టైపిస్టులు - అంది అద్దంలో సింగారించుకుంటూ అనసూయ.

ఈ రోజుల్లో లేడీ టైపిస్టులకేం కొఱతలే. చాలా ఆఫీసుల్లో వాళ్ళే వున్నారన్నాడు కృష్ణారావు.

అసలు మీ పేరే కృష్ణుడు. ఇంక గోపికలకు లోటుండదులెండి అంది నాలుక కఱచుకుంటూ ఆ టక్కరి అనసూయ.

నీలాంటి రాధ వుండగా ఆ టక్కరి గోపికలతో యేంపని నాకు అన్నాడు కృష్ణారావు.

'మగవారినిలా నమ్మరాదే చెలీ' అని కవులు గానం చేశారు. మతిలేక చెప్పారా. ఏమో బాబూ - మగాళ్ళంటేనే నాకు సందేహం! అంది చమత్కారంగా నిసింద్రీ అనసూయ.

అనసూయా! నువ్వు పొరబడుతున్నావ్, మగాడంటే అంత పిచ్చిలోతి అనేనా నీ వూహ. ఆడది కనిపించినంతమాత్రాన ఏదోయిక గిత్తలాగ గిలగిలలాడిపోతాడనేనా నీ అపోహ, అసలు మగాళ్ళని మనస్సు మళ్ళించి - మాయ చేసి - మోసాలతో విలాసం చేసేది ఆడాళ్ళు, ఏమంటావ్ - అన్నాడు సీరియస్‌గా కృష్ణారావు.

ఏమీయెరగని ఆడదానికి కామశాస్త్రోపన్యాసాలిచ్చి - హామీలిచ్చి - ఆనందంతో అరచేతి స్వర్గాన్ని చూపిస్తానని అవసరం దీర్చుకొని - అవతలకుపో అనేది మగాళ్ళు. మగపీడ లేకపోతే ఆడదాని ఆరోగ్యం - ఆనందం - ఆయువూ చాలా భద్రంగా వుండేవి - అంది అనసూయ ఆవేశంతో.

ఆడదిలేని మగవాడూ - మగవాడులేని ఆడదీ వట్టి ఎడారి ప్రాయం. ఈ నరనారీ సమ్మేళనమే లేకపోతే బ్రహ్మదేవుని సృష్టికి ఏనాడో ఫుల్‌స్టాప్. నేను గొప్ప - నీవు గొప్ప అనుకోవడం ఎందుకు? సరిపెట్టుకొని - సరదాగా సంసారాన్ని స్వర్గం చేసిన ఆడదే ఆడది - అన్నాడు కృష్ణారావు.

అగ్నిసాక్షిగా అందరి ఎదుటా పెళ్ళి అనే ప్రాతిపదిక మీద వివాహం చేసుకొని - ఆ యిల్లాలిని గాక తదితర స్త్రీలతో కులికే మగాళ్ళుంటే ఆడది ఆ సంసారాన్ని స్వర్గం చేయగలదా? ఛస్తే చేయలేదు. ఏమంటారు? అంది అనసూయ.

మగాడు తుంటరే అనుకో. అంతమాత్రాన ఆడది ఎందుకు తుంటరికావాలి? చేతనయితే - తెలివివుంటే తన తడాఖాలో భర్తని రైటుమార్గంలో వుంచుకోవాలి - అదే మజా! అన్నాడు కృష్ణారావు

ఇలాంటి వితండవాదాలతో ఆరాత్రి గడచిపోయింది.

అనసూయ - ఆ మర్నాటి ఉదయం కృష్ణారావుకి కాఫీ అందిస్తూ యిలా అంది "మనసు కళ్ళెంలేని గుఱ్ఱంలాంటిది. చిక్కపట్టాలిసుమండీ" అని రాత్రి ఆ వుపన్యాసం. తెల్లారియీమాట. కృష్ణారావుకి యేమీ బోధపడటంలేదు అనసూయ వరస. విసుగెత్తి ఆఖరుకి యిలా అన్నాడు. "అనసూయా! నువ్వేమనుకుంటున్నావో కాని - నా మనస్సు నా స్వాధీనంలో నేవుంటుంది - వుంది. నామనస్సుని మార్చగలశక్తి యేదీలేదనుకో. అంతతేలిగ్గా మనసు మార్చుకోవడం మాయింటా వంటాలేదు. ఆలాంటి రెప్టైలిక్ టెండెన్సీలు మన దగ్గర సాగవు. అయినా అనసూయా! లోపలయింత కుళ్ళు వుంచుకొని అన్యాపదేశంగా దెబ్బలు కొట్టడం ప్రజ్ఞ కాదు. నాలోపం నీకేదైనా తెలిస్తే చెప్పు. తక్షణం సవరించుకుంటూ, లేనిపోని అపవాదులు నానెత్తిమీద వెయ్యకు, నీకు పుణ్యంవుంటుంది." అన్నాడు కృష్ణారావు.

మీకు అపకీర్తివస్తే నాకు కాదా? మన కుటుంబానికికాదా? అలా రానిస్తానా? వూరికేనే అన్నాను. మగవాడు ఆడదానితో ప్రథమపరిచయంలో మర్యాదనీ గౌరవాన్నీ ప్రదర్శిస్తాడు. ఈ మచ్చు మందుతో కామదానులు ఆ అమాయకురాలిని వలలో వేసుకొంటారు. ఆఖరకు వాడిన గులాబీ పెంటమీదకు పోయినట్టుగా వుంటుంది ఆ అమాయిక బ్రతుకు, అంచేతనే అంటున్నాను యేలేడీ టైపిస్టు సహవాసానికీ పోవద్దనీ - గాలిమేడలు కట్టుకోవద్దనీ - అఘాయిత్యాలు కావద్దనీ - యిలా చెప్పింది అనసూయ.

అనసూయకి యెలా తెలిసింది - నేను ఆ లేడీ టైపిస్టు రోజస్‌తో మాట్లాడుతున్నట్టు. ఆవిడ వదలిన "ప్రథమ పరిచయం" బాణం - నిక్కచ్చిగా నా మీదే. ఆడాళ్లు దేవాంతకులు, ఎలా పని కట్టిందో యీ వాతావరణాన్ని, ఆవిడకూ - నాకూ పరిచయం ప్రబలి - ప్రణయంగామారి - ఆఖరికి విడాకులు అనసూయకిచ్చి - క్రైస్తవమతం పుచ్చుకొని - ప్రణయానికి మతాన్ని బలిదానం చేస్తాననేనా? యీ అనసూయ అనుమానం-యిలా ఆలోచించాడు ఆందోళనతో కృష్ణారావు.

రోజా చలాకీపిల్ల. క్రిస్టియన్ కావచ్చు, ఆ పిల్లని చూస్తే యెందుకు హిందూపిల్లలు? ఎంత తేజస్సు, ఎంత ఆనందం, ఎంత మర్యాద. అసలు రిజర్వుడుగా! ఆ పిల్ల, ఎంత టైపుచేసినా తీరికగా మాట్లాడితేనా? అవునులే - నాతో సోషల్‌గా అంత ఆఫీసులో ప్రత్యేకంగా మాట్లాడితే - మిగతావాళ్ళు ఆ దృశ్యాన్ని భరించగలరా? మానం ఉభయతారకమైనది, చూడాలి అనుకుంటూ రోజాను తలుచుకుంటూ రాజాలాగే కృష్ణారావు ఆఫీసుకు పోతున్నాడు.

ఆ సాయంత్రం కృష్ణారావుతోపాటు ఆనందరావు కూడా వాళ్ళ యింటికి వచ్చాడు. వీళ్ళిద్దరూ తమ ఆఫీసు గొడవల్ని దర్జాగా చర్చించుకుంటున్నారు. ఎన్నో గొడవలు దొర్లిపోతున్నాయి వారి మాటల ప్రవాహంలో, ఇందులోనే టైపిస్టు రోజా వాలుచూపులూ - కృష్ణారావు మందమతితనం - పనిమీద ధ్యాసలేకపోవడం - యేదైనా కొంచం పనిచేస్తే దానిలో లక్షతప్పులుండడం-ఏదో వంకని కృష్ణారావు రోజా దగ్గఱకుపోవడం - మాట్లాడడానికి రోజా అంత చనువియ్యకపోవడం-యీ విషయాలు కొంచెం గుప్తంగా యింగ్లీషులో సాగిపోతున్నాయి. వెడుతు వెడుతూ ఆనందరావు కృష్ణారావుతో అన్నాడు, "బ్రదర్ - నిన్నుచూస్తే జాలివేస్తోంది. చక్కని భార్యవుంది, మంచి వుద్యోగంచేస్తున్నావ్, అది క్రైస్తవులపిల్ల, ప్రేమకి కులంలేదు, ప్రేమ భావం బలమైతే యెంతటికైనా దిగుతుంది, తెస్తుంది. నా మాటవిను. సంసార స్వర్గాన్ని నరకంచెయ్యకు. దూరదృష్టితోవుండు అన్నాడు."

ఇదంతా ఇంగ్లీషులో సాగిందికదా - అనసూయకి తెలుస్తుందా? అనుకున్నాడు అహంకారంతో కృష్ణారావు. మతిపించడానికి - భోజనాలయ్యాక రెండో ఆట సినిమాకి తీసుకొని వెళ్ళాడు భార్యని. ఆ సినీమాహాలులో నడుస్తూన్న చిత్రంకూడ చిత్రంగానేవుంది, కాని అనసూయ ఏదో మాదిరిగావుండటం కృష్ణారావు గ్రహించకపోలేదు. భార్యను బాధపెట్టడం యెందుకని ఆ రోజాధ్యాస మానితేగా? చస్తే మానడు. ఆ వేళ తెల్లారింది. కాఫీలయ్యాయి. రేడియోదగ్గర ఆనందిస్తూ పేపరు చదువుతున్నాడు కృష్ణారావు. చూస్తూండగా ఎనిమిది దాటింది. మొదటి బట్వాడా పోస్టు వచ్చింది. కృష్ణారావుపేరు చదివి ఒక బ్లూ లెటరు యిచ్చాడు పోస్టుమేన్.

(సశేషము)


AMRUTANJAN
The Pain Balm
Amrutanjan Limited
BOMBAY, MADRAS

అన్ని నొప్పులకు
అమృతాంజనము

Grihalakshmi - May - 59.

# సంపాదకీయములు

## జాతీయరంగంలో ఇంగ్లీషు

ఇంగ్లీషు భాషను విదేశీయభాషగా భావించి ఏవగించుకున్నరోజులు కొన్ని సంవత్సరాల క్రిందట గడచిపోయినవి. ఇంగ్లీషు మూలంగా మన సంస్కృతి, విజ్ఞానము, జాతీయత ప్రమాదావస్థలో నున్నదని ఎదురుతిరిగి పోరాడినకాలం దాటిపోయింది. కాని యీ నాడు మాత్రం ఇంగ్లీషు మన దేశంలో మన జాతీయ భాషలలో నొక్కటై, దేశం మొత్తాన్ని సంఘటితపరచి, సమరస సమైక్యతలను పెంపొందించ డానికి తోడ్పడినదంటే వ్యతిరేకించగలవారెవరులేరు. పైగా ఇంగ్లీషుభాష ఏఒక్క ఇంగ్లండుకే కాక ప్రపంచ వ్యాప్తంగా బహుళోపయుక్తమైనదై ప్రపంచపు నలుమూలలను సమైక్యపరుస్తున్నది.

భాషల మధ్య స్పర్థ వ్యక్తిగతంగా ఏభాష యభివృద్ధికి తోడ్పడక పోవుటయేకాక దేశంయొక్క సమైక్యతకు, శాంతి భద్రతలకు ముప్పు వాటిల్లగల ప్రమాదముకలదు. ఈ నాడు ఇంగ్లీషు యించుమించుగా మాతృభాషలాగనే వాడుకలో నున్నదని కేంద్రశాస్త్రపరిశోధన, వైజ్ఞానిక వ్యవహారాల మంత్రి శ్రీ హుమయూన్ కబీర్ చెప్పడంటే యదార్థము ఉట్టిపడుతున్నది. ప్రాంతీయభాషలయినా, జాతీయ భాషగా తలపెట్టబడిన హిందీభాషయయినా ఒక భాష మరొక భాషను అణగత్రొక్కి వ్యక్తిగతంగా వృద్ధి పొందజాలదు.

ఇంగ్లీషు ప్రస్తుతము మనదేశంలో విరివిగా వాడుకలోనున్న భాష. దానివలన మనకు జాతీయ, అంతర్జాతీయ రంగాలలో అనేక వసతులు, లాభాలు, సదవకాశములు కలవుగాని మనకు అపకారమంటూ లేదు. ఈ పరిస్థితులలో కొందరు ప్రాంతీయ భాషాభిమానముతో ఇంగ్లీషును ద్వేషించుటకాని, ఇంగ్లీషు భాషాభ్యాసానికి స్వస్తి చెప్పుటకు తలపెట్టుటకాని విజ్ఞతకాజాలదు.

ఇంగ్లీషుభాష సయితం జాతీయభాషలలో నొకటిగా వర్ధిల్లడం సర్వదా శ్రేయస్కరం.

## మన జాతీయ నాయకత్వము

శ్రీమతి ఇందిరా గాంధీ జాతీయ నాయకత్వమును కాంగ్రెస్ అధ్యక్షురాలుగా స్వీకరించినప్పటినుండి సహచర, అనుచరులలో వివిధ అభిప్రాయములు పొడజూపి యుండవచ్చును. కాని ఆమె జాతీయ సమస్యలపట్ల చూపుచున్న ఆసక్తి, చిత్తశుద్ధి వాస్తవికత కనుగుణ్యంగా నున్నవనుటకు ఆధారములనేకములు. ఆమె కాంగ్రెస్‌వాదుల నుద్దేశించి జాతీయ ఆదర్శాలకు భిన్నంగా నున్నవారు సంస్థను విడనాడటం శ్రేయస్కరమని హెచ్చరించడం సాహసమనే చెప్పాలి. సహకార వ్యవసాయము నమలుపరచుటలో విభిన్న అభిప్రాయాలుగల కాంగ్రెస్‌వాదులను, కాంగ్రెస్‌పార్టీ క్రమశిక్షణకు లోబడిన విధానముల ననుసరించి జాతీయ సౌభాగ్యమునకు తోడ్పడుటయో లేక సంస్థను విడనాడుటయో రెండే మార్గాలని హెచ్చరించిన ధీరురాలు శ్రీమతి ఇందిరా గాంధీ.

ఆమెకు ప్రజాసమస్యలపట్ల ఎంత ఆసక్తియుంటేనో గాని తాను ప్రజాభ్యుదయ అభివృద్ధుల నుద్దేశించి జాతీయ సిద్ధాంతాల ననుసరించి సేవచేయలేనప్పుడు కాంగ్రెస్‌ను విడనాడగలనని ప్రకటించియుండదు.

కేరళ రాష్ట్రంలోని కమ్యూనిస్టుపాలనను గురించి పరిస్థితులను స్వయంగా చూచివచ్చి కమ్యూనిస్టు పాలనపట్లగల ప్రజల వ్యతిరేకత, అసంతృప్తిని వినియోగించుకొని స్థానిక కాంగ్రెస్‌వాదులు జాతీయ ఉద్యమం మరింత పటిష్టము చేసికోడానికి ప్రయత్నించాలని శ్రీమతి ఇందిరా గాంధీ యన్నారు.

శ్రీమతి ఇందిరాగాంధీమీద భారత ప్రధాని నెహ్రూ ప్రభావమెట్టిదైనా ప్రజాశ్రేయస్సుకు, అభివృద్ధి, అభ్యుదయాలకు భిన్నముగా నుండదు. కాంగ్రెస్ ఆదర్శ లక్ష్యాలతో జాతీయ పురోభివృద్ధిని జాతీయవాదుల సమీకరణ, సహకారములతో రూపొందించకలిగినచో ఆమె నాయకత్వము సార్థకత్వము నొందగలదు.

## వరకట్నాల నిషేధంయొక్క ఆవశ్యకత

సామాన్య కుటుంబాల శ్రేయస్సు నుద్దేశించి వరకట్నాలను నిషేధిస్తూ చట్టం రూపొందవలసిన ఆవశ్యకత విశేషముగానున్నది. ఈనాడు వయసుమీరినా అనేకమంది ఆడపిల్లలకు వివాహములు కాక తల్లిదండ్రులకు బరువు భారము లధికమగుటకు వరకట్నాలు ప్రధాన కారణము. తమ మగబిడ్డలకు వేలు వందలు వెచ్చించి చదువులు చెప్పించామని తమకు ఆర్థికస్థిమితము, యోగ్యతలు, తమ బిడ్డలకు ఉద్యోగ వసతులున్నా లేకపోయినా తాము వెచ్చించిన మొత్తాలనో లేక యిబ్బడిగానో కట్నాల మూలంగా రాబట్టుకోవాలని ఆడపిల్లల తలిదండ్రుల స్థిమితమును గుర్తించకుండా ఆరాటపడేవారిని అదుపులో పెట్టకలిగినప్పుడే రూపొందనున్న వరకట్నాల నిషేధచట్టం సార్థకం కాగలదు.

యోగ్యతలుండి, అవకాశములు, స్థిమితము ఉండి యోగ్యతల ననుసరించి కట్నకానుకల నివ్వగలవారిని గురించికాని, వానిని స్వీకరించువారిని గురించిగాని ప్రసక్తియే లేదు. తమ బిడ్డల శ్రేయోసౌభాగ్యముల నుద్దేశించి ఏరూపంగా, ఏలాగిచ్చినా యివ్వ నవకాశములున్నవి. వానిని పెండ్లి సందర్భముననే కట్నకానుకలుగా నివ్వనవసరముండదు. తమ ఆడపిల్లల శ్రేయో సౌభాగ్యముల నుద్దేశించి యిచ్చే బహుమతులు ప్రేమానురాగాలు, సద్భావముమీద నాధారపడి యుండాలికాని కట్నకానుకలున్ననే కాని వివాహమున కియ్యకొనమని భీష్మించుకునే వరులయొక్క, వారి తల్లిదండ్రులయొక్క మనస్తత్వముల ననుసరించి యుండకూడదు.

ఆడపిల్లల తండ్రులైనా తమ బిడ్డలకు మగబిడ్డలతో సమానంగా వారికి భవిష్యత్ జీవితంలో వినియోగపడే విద్యావిజ్ఞానములను, లలితకళలను, కుటుంబ నిర్వహణా విజ్ఞానమును సమకూర్చాలి. ముఖ్యంగా తమ అంతస్థునుమించి ఎదటివారి యోగ్యతలనైనా సక్రమంగా పరిశీలించకుండా కట్నకానుకలతో ఆడపిల్లలకు వివాహములు చేయ పూనుకోడం విజ్ఞత కాజాలదు.

——(o)——

పాత్రుడుగారి

బాలసంజీవిని (Regd)

పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును

డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,

19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు-4. Phone 71354

కుంభకోణము బ్రాంచి : 7. సారంగపాణి కోవిల తూర్పువీధి.

అన్ని మందుల షాపులలోను దొరకును.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు, బెంగుళూరు

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Ag. Editor : C. C. Punniah.
(Private) Ltd

# భారత ప్రశస్తి

# THE PRIDE of INDIA




# LODHRA

## FOR LADIES' HEALTH

**KESARI KUTEERAM Private LTD.**
MADRAS-14.




స్త్రీల ఆరోగ్య భాగ్యనిధి